Sri Ramakrishna Grandhamala No 2

SECTION 1

---

# WORKS OF

His Holiness

# SRI SWAMI VIVEKANANDA

IN TELUGU.

---

Addresses on

# KARMAYOGA

IN

EIGHT CHAPTERS.

శ్రీరామకృష్ణగ్రంథమాల నెం 2. రు

# శ్రీవివేకానందస్వాములవారి

# మహోపన్యాసములు

కర్మయోగముమీఁది యుపన్యాసములు

ఇవి,

మ॥ సంపూరి మూర్తిరాజు బి. ఏ. గారిచే

నాంధ్రీకరింపఁబడి.

—:-o-:—

గోదావరిజిల్లా కడియంగ్రామములో స్థాపించబడిన

"శ్రీరామకృష్ణ గ్రంథాలయం" మేనేజరు

శ్రీకురుమెళ్ల రామారాయణంగారిచే

ప్రకటింపబడినవి.

మొదటికూర్పు 1000 ప్రతులు

కాకినాడ.

సి. హెచ్. కైలాసరావు బ్రదర్సువారి

కమలాముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినవి.

1914.



[వెల రు 0—8—0]




# CONTENTS

## విషయసూచిక



# కర్మయోగము.

మొదటి ప్రకరణము.




కర్మ—వర్తనము.

## (Karma in its effect on character)

కర్మయను శబ్దము, ‹చేయుట› యనునర్థమిచ్చు ‹కృ› అనుధాతువునుండి పుట్టినది. పనియంతయు కర్మయే పారిభాషికముగా, నీపదమునకు గర్మఫలమని కూడ యర్థముకలదు. కొన్నిచోట్ల దీనికి పూర్వజన్మకృత కర్మలయొక్క ఫలములుకూడ యర్థమగుచున్నవి. కాని కర్మయోగమందు మాత్రము ‹కర్మ› పదము పనియనిమాత్రమే యర్థమిచ్చుచున్నది. మనుష్యకోటికి జ్ఞానసంపాదనమే పరమప్రయోజనము. ప్రాచ్యధర్మశాస్త్రములు మన కొసంగిన లక్ష్యమదియొక్కటియే. జ్ఞానమేపరమార్థముగాని వినోదముకాదు. వినోదమును సుఖమును నశ్వరములు. అట్టివినోదమే జన్మకుఁగావలసినపరమప్రయోజనమనుటతప్పు.

మనలోకమందున్న దుఃఖము లన్నిటికిని మూలము, సుఖమే. జన్మకు సార్థకమని భ్రమపడి దానికై పాటుపడుటయే, కొంతకాలమయినతరువాత తనకు గావలసినది జ్ఞానముగాని సుఖముకాదనియు సుఖదుఃఖములు రెండునుగూడ గొప్పగురువులవంటివనియు పుణ్యమువలనఁ దనకెంతజ్ఞానము కలుగునో, పాపమువలనఁగూడనంత జ్ఞానము కలుగుననియుఁ దెలియవచ్చును. సుఖమును దుఃఖమును గతించిపోవు

నప్పుడు ఆత్మయందు వానివాని ప్రతిమ ముద్రితమగును. ఈప్రతిమలన్నిటియొక్క మిశ్రమఫలము మనుష్యుని వర్తనము లేక గుణము అగును. ఏమనుష్యుని గుణమును దీసికొన్నను అది వాస్తవముగా వాని మనోధోరణులయొక్క సమామ్నాయమయి యుండును. ఆగుణము లేక స్వభావముత్పత్తియగుటకు కారణము సుఖదుఃఖములు రెండింటియొక్కయు ననుభవమే కాని వేరు కాదు. స్వభావ మేర్పరచుటయందు మంచి చెడుగు రెండును గూడ సమాన ప్రభావమును గలిగి యున్నవి. ఇంతేకాక కొన్ని విషయములలో సుఖముకంటె కష్టమే యెక్కువజ్ఞానోపదేశమును జేయును. లోకమందుఘనులయిన వారినెవ్వరి చారిత్రమును దీసుకొని శోధించినను చాలచోట్ల వారిఘనతకు గారణము వారనుభవించిన సుఖముకంటె కష్టమేయనియు, భాగ్యముకంటె దరిద్రమేయనియు, వారికిగలిగిన స్తుతికంటె నిందయేయనియు, దెలియవచ్చును.

మరియు జ్ఞానము మనుష్యుని లోపలనుండియున్నది గాని వెలుపలనుండి వచ్చుచుండుట లేదు. అంతయులోననున్నది. ఒకమనుష్యునికిని తెలియును, అని మనమనిన దానికర్థము దానినాతఁడిప్పుడుకనిపెట్టినాడని యర్థము. ఒకడిది, నేర్చుకొనె' నని యనినను అనంతమైన జ్ఞానమునకాకరమైన యాత్మయందున్న యారత్నము నిప్పుడాతడు వెదకి త్రవ్వి పైకిదీసెనని యర్థము. ఇదియే మనోశాస్త్రసమ్మతమయిన యర్థము. న్యూటను ఆకర్షణశక్తిని గనిపెట్టెననియనుచున్నాము. అదివానికొరకెక్కడనైన నొకమూల గూర్చుండియున్నదా? అది వానిమనస్సులోనున్నది. సమయము వచ్చినప్పుడాతనికి గోచరించినది. ప్రపంచమునందున్నజ్ఞానమంతయు మనస్సునుండి వచ్చును. బ్రహ్మాండములన్నింటికిజాలిన గ్రంథభాండాగారమంతయు మనస్సులోనున్నది. బాహ్యప్రపంచమంతయు కేవలనిమిత్తమాత్రమై మనఃపరిశ్రమచేయుటకు ప్రోత్స

హింపబడిగానున్నది. మనము నేర్చుకొనునదంతయు మనస్సునుండియే. పండురాలి న్యూటనును బురికొల్పెను. అంతట నతడు మనస్సును జదువనారంభించెను. అందలి తొల్లింటి యూహలనన్నింటిని వరుసగా కూర్చియందు ఆకర్షణశక్తి యుండవలసిన తావు నొకదానిగని పెట్టి యచ్చోటదానినమర్చెను. దానిని మనము ఆకర్షణ సిద్ధాంతమని పిలుచుచున్నాము అది యాపడిన పండునందుగాని భూమధ్యముననున్న మరిదేని యందుగాని లేదు. కాబట్టి జ్ఞానము, విజ్ఞానము నన్నియు కూడ మనస్సునందే యున్నవి. అది యనేకచోట్ల వ్యక్తముగాక ప్రచ్ఛన్నమయియుండును. ఆ యాచ్ఛాదనము దొలగుచున్నప్పుడు మనము నేర్చుకొనుచున్నామని యనుకొందుము. అదియే జ్ఞానాభివృద్ధి యనంబడును. ఎవని మనస్సునను న్న యీ తెరలెన్నో దొలగునో యతడు జ్ఞానియనంబడుచున్నాడు. ఎవనియందది దట్టముగానుండునో వాడు, మూర్ఖుడగుచున్నాడు. ఎవని యందది పూర్తిగా తొలగినదో వాడు, సర్వజ్ఞుడగుచున్నాడు. అట్టి సర్వజ్ఞులిప్పుడున్నారు. ఇంక ముందు నుందురని నా యాశయము. ముందు యుగములలో వేనవేలుండుదురు. బొమ్మరాయి యందు నిప్పువలె మనుష్యునందు జ్ఞానముండును. రాపిడివలన నగ్గిపైకి వచ్చినట్లు అనుభవము వలన జ్ఞానము కలుగును. కాబట్టి మన మనోభావము లను మథనము చేయు దెబ్బలును—మననగవులు ఏడ్పులును సుఖదుఃఖములు దూషణభూషణములు, నిందాస్తుతులును— ఇవన్నియు మనము నెమ్మదిగా యోచించి చూచినయెడల మనలోపలనుండియే వచ్చుచున్నట్లు మనకు తెలియగలదు. దీనికి ఫలముగానె మనస్స్వభావమేర్పడుచున్నది. వీనిసమూహమంతటికిని కర్మయని పేరు. శారీరకమయినట్టియు, మానసికమయినట్టియు, ప్రతి ప్రహారణము నాత్మకు దగిలి దానివలన జ్ఞానాగ్నిని పైచ్చుచుండును. దీనికి కర్మయని పేరు.

వారు లక్షలకొలదిగలరు. అట్టిబుద్ధి కేవల పరంపరా ప్రాప్తముగాఁ తల్లి దండ్రుల క్షేత్రబీజప్రభావము వలననే సంప్రాప్తమగునదైనయెడల బుద్ధుని తండ్రివంటి యొకచిన్నరాజు తిన్నగ దనసేవకులనైనఁ బరిపాలింప జాలనివాఁడు, లోకములో సగము మందిని శాదాక్రాంతులనుగా జేయగలిగిన కుమారుని గనుటకేమిసమాధానము చెప్పగలము? వడ్లంగికిని లోకమునందంతటఁ దేవుఁడని పూజింపబడుచున్నవాని కుమారునికిని గల తారతమ్యమున కేమిసమాధానము చెప్పుదుము.

అనువంశసంపత్తి సిద్ధాంతము నిలువదు. బుద్ధుఁడు ఏసుక్రీస్తు వీరిబుద్ధి యెక్కడనుండి వచ్చినది? ఈశక్తి యెక్కడనుకూడినది. ఎన్నికాలముల నుండియో యట్టిశక్తి యొకటి యేర్పాటయివృద్ధిఁబొందుచుండవలెను. ఇట్లు వృద్ధికాగా కాగా బుద్ధునియందో క్రీస్తునందో వ్యక్తము కావలెను.

ఇదంతయు కర్మవలననే నిర్ణయింపఁబడును. మనము సంపాదించుకొననిది మనకేదియును రాదు. ఇది శాశ్వతమగుశాసనము. కొన్నివేళలట్లుకానట్లు కనిపించునుగాని చివరకది మనమొప్పుకొనితీరుదుము. ఒకఁడు ధనమునిమిత్తమయి యావజ్జీవమును బాటుపడవచ్చును.. అనేకమందిని మోసముచేయవచ్చును. కానితుదకు ప్రాణమువిసిగి మనము ధనవంతులము కాజాలమని నిస్పృహతోఁచి వానిజన్మ కష్టభాజనమై యుండును. ఇహసుఖముకొఱకు మనమనేకవస్తువులను సమకూర్చుచుండవచ్చును. ఏవియైనను మనము సంపాదించుకొననివి నిశ్చయముగా మనవికావు. విద్యాగంధములేని వాఁడొకఁడు లోకములోనున్న పుస్తకములనన్నింటిని గొనవచ్చును. అవియన్నియు వానిబీరువాలలో నుండును. అందు వానికర్హతయున్న వానినే వాఁడు చదువగలఁడు. ఈయర్హత కర్మవలనగలుగును. మనకెంతవఱకర్హతకలదో మనదియేదో మనక

ర్మనిర్ణయించును. మనగతికి మనమే యుత్తరవాదులము. మనమెంత వారము కావలయునని నంతవారమగుటకు మనకుశక్తికలదు. మనప్రస్తుతస్థితిమన పూర్వకర్మకు ఫలమయినయెడల మనభావిగతి మనప్రస్తుతకర్మనుబట్టి యేర్పడును. కాబట్టి మనమెట్లు కర్మనాచరించవలెనో మనము తెలుసుకొనవలెను. ఎట్లుపనిచేయ వలయునో నేర్చుకొననేల? ఏదోయొకరీతి నందరు పనులను జేయుచునేయున్నారని నీవనవచ్చును. కాని శక్తివ్యర్థవినియోగమగుటయొకటి కలదు. కర్మయోగ మనగా తెలిసి వివేకముగాకర్మను జేయుటయని గీతాశాస్త్రముబోధించుచున్నది. కర్మాచరణమెట్లో తెలిపిన వానికి పూర్తియైన ఫలములభించును. ప్రతికర్మకును ప్రయోజనము ఆత్మయందు లీయమయి యడగియున్నశక్తులను బ్రబోధించుటయని మనము జ్ఞాపకముంచుకొనవలెను. అట్టిశక్తియును జ్ఞానమును ప్రతివాని యందునుగలవు. మనమాచరించుకర్మలవలన నాశక్తులుత్తిష్ఠములగును.

మనుష్యుండనేకములయిన యుద్దేశములతో పనిచేయుచుండును. ఎదోయొక యుద్దేశము వినాకర్మయుండదు. కొందరు యశస్కాములయి యందులకుఁబనిచేయుదురు. కొందరు ధనాపేక్షులయి దానికొఱకు బనిచేయుదురు. కొందరధికారమునుగోరి యందులకు బాటుపడుదురు. కొందరు స్వర్గమును వాంఛించి యందులకు బనిచేయుదురు. చనిపోయినతరువాత తమపేరుండవలయునని కొందరు గోరుదురు. అట్టివారు చైనాదేశమున గలరు. వారికి మరణానంతరమునగాని బిరుదులు రావు. అది వీనియన్నింటికంటె మంచి పద్ధతియని నాతాత్పర్యము. అచ్చట నెవరైన నుత్కృష్టకార్యము నొక దానినాచరించిన యెడల నాతనితండ్రికో తాతకో యొక ఘనతను సూచించు బిరుదమొసంగబడును. కొందరట్టిదానికై పనిచేయుదురు. కొందరుమహమ్మదీయజాతులవారు తాముచని

పోయినప్పుడు తమకు పెద్దగోరీకట్టవలయునను కోరికతో పనిచేయుదురు. కొన్నిజాతులలో బిడ్డపుట్టగానే దానికొక గోరినిగట్టుదురు. అదియెంత పెద్దదిగాను సొగసుగానుండునో వాడంత వృద్ధిలోనికి వచ్చునని వారిన మ్మకము. కొందరు పాపవిమోచనకై తపించుదురు. అనేక దుర్మార్గపు కార్యములొనరించి పిమ్మట నొక దేవాలయమును గట్టించి తమగురువులకులంచమిచ్చి స్వర్గమునకు బోవుటకు వారియొద్దనుండి యొకసెలవు చీటిని బుచ్చుకొనువారు కొందరు. ఇట్టి యౌదార్యము వారిని బాపవిముక్తులనుగా జేయుననియు నెన్నిపాపములు చేసినను తాముతప్పించుకొనవచ్చుననియు వారియభిప్రాయము. కర్మాచరణమునకుగలవివిధములయిన యుద్దేశము లిట్టివిగానున్నవి.

అట్టి యుద్దేశము లేకుండ కేవలము నిష్కామ్యకర్మయొకటి కలదు. ప్రతిదేశమునందును గొందరు మహాత్ములయినవారు పేరు ప్రఖ్యాతులకును స్వర్గాదిభోగములకు నపేక్షింపక నిష్కామ్యముగా కర్మము నాచరించువారు కలరు. కర్మమున మేలు కలుగునని యెంచి వారు పనిచేయుదురు. మఱికొందరింతకంటెను సదుద్దేశముతో పేదవారికిని మానవకోటికిని ఉపకారములు చేయువారు కలరు. వారికి సత్కార్యాచరణమందాసక్తిగనుక వారట్లుచేయుదురు. పేరు ప్రఖ్యాతుల కాశించి కర్మను జేయుటవలన సర్వోఫలము కలుగనేఱదు. దానిఫలము మనము ముదుసలివారమయిన తరువాత గానిలభింపదు. స్వలాభమునపేక్షించి పనిచేయనివారి కేమియును ప్రయోజనములేదా? కలదు. వానికేయత్యుత్తమమయిన ఫలముకలదు. అది శరీరారోగ్యమునకు గూడ జాలమంచిది. ప్రేమ, సత్యము,స్వార్థ పరత్వ రహితత్వము,ననునవి కేవలాలంకారములు మాత్రమేగాక యవియే మనకు బరమమయిన లక్ష్యములుగానున్నవి. వానియందెంతయో శక్తి కలదు. ఎవ్వరైననొక యైదు దినములు

గాని క్షుద్రనిమిషములుగాని యెవ్విధమయిన స్వార్థపరత్వమును లేకుం
డభావిగతిని గూర్చిగాని స్వర్గమును గూర్చిగాని శిక్షనుగురించిగాని యే
మియును తలంపులేకుండ పని చేయగలిగినచో నట్టివాడు నీతిఖని
యనియెన్నదగినవాడగును. అట్లాచరించుట దుష్కరమే. కాని యట్టిక
ర్మాచరణముల వలన నెట్టిఫలముకలదో మన మెఱుగుదుము. అట్టిని
ర్బంధముతో పనిచేయఁ గలుగుట కెంతయో మహాత్త్వముండవలెను
అన్ని ప్రవృత్తులకంటెను చిత్తనిరోధము విశేషమయిన శక్తిని తెలియఁజే
యును. నాలుగు గుఱ్ఱములనుగట్టిన బండినిర్నిరోధ మయినయెడల కొం
డమీదినుండి క్రిందికి పడిపోవుటయును సూతుఁడట్లుపడకుండ గుఱ్ఱముల
నిరోధించి నెమ్మదిగా నడపుటయును గలదు. ఇందు దేనికెక్కువ శక్తి
కావలయును. ఒక ఫిరంగి గుండు నాకాశమున విడిచితిమా చాలదూర
ము పోయి క్రిందబడును. యింకొకటి గోడకు దాకినయెడల దానివలన
విస్తారముష్ణము గలుగును. సకామ్యమయిన కర్మక్రింద వెచ్చమయిన
శక్తియంతయు వ్యర్థమగును. దానివలన మనకు మరల శక్తిరానేరదు.
అట్లుగాక యరికట్టినయెడల దానివలన శక్తియుత్పన్నమగును. ఈచిత్త
నిరోధమువలన నధికమయిన శక్తియుత్పన్నమయి క్రీస్తు,బుద్ధుడు మొదల
గువారివంటి పురుషులు బయలుదేరుదురు. మూఢులయిన వారీరహస్య
ము నెఱుగరు గాని మానవకోటినంతను నేలవలయునని మాత్రముకోరు
చుందురు. పనిచేయుచు వేచియుండినయెడల మూర్ఖుడు సయితము లోకము
నేలవచ్చును. లోకమేలవలయునను నిర్భాగ్యపు కోరికను మాత్రమువిడిచి
పెట్టి కొన్ని సంవత్సరములు పనిచేసిన యెడల తరువాత వానికిఁగావల
సినంత శక్తి కలుగును. పశువులకు గొన్నియడుగుల దూరముకంటె నె
క్కువ కనపడనట్లు మనలోఁజాలామందికి గొన్ని యేండ్లకంటె నెక్కు
వకాలము గోచరించదు. ఒక చిన్నకూపమే మనలోకము. అదిదాటి

మనదృష్టి ప్రసరింపక మనము వినీతివంతులమును దుష్టులమును నగుచున్నాము. యిదియే మన దౌర్బల్యమునకు శక్తిహీనతకును గారణము.

అత్యల్పరూపమయిన కర్మలనయినను నిరసింపరాదు. ఎక్కువయెఱుగనివాఁడు పేరు ప్రతిష్ఠల కాసించియే పనిచేయవచ్చును. కాని క్రమక్రమముగా పైకిపోయి ఘనతరమయిన యుద్దేశములను గలిగించుకొని వాని బోధపరుచుకొనుచుండవలెను.

„కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషుకదాచన" ఫలములజోలి మనకక్కఱలేదు. వానిజోలి యేల? నీవెవరికైన నుపకారము చేయఁగోరినయెడల వాఁడు నీవిషయమున నెట్లుండవలయునో యని యాలోచింపకుము. నీవేదయిన ఘనకార్యమునుగాని సత్కార్యమునుగాని చేయవలయునని యనుకొనునప్పుడు దానిఫలమేమయి యుండునను చింత విడిచిపెట్టుము.

ఈకర్మయోగమందొక చిక్కుకలదు. మిక్కిలి చురుకుదనమావశ్యకము. మన మెప్పుడును పనిచేయుచుండవలెను. మనము పనిచేయకుండ నిముషమయిన నుండఁజాలము. ఇక విశ్రాంతియన నెట్టిది? జీవయాత్రయొక్క యొకభాగమిది. సంతత కర్మపరిభ్రమణము. రెండవది శాంతుఁడై విరాగియైయుండుట. వానిపరిసరమంతయు ప్రశాంతమై లేశమయిన సద్దులేక నిర్మలమయి నిశ్చలమయిన ప్రకృతిమాత్ర ముండును. ఇందేదియును ప్రత్యేకముగా పరిపూర్ణము కాదు. అట్టియేకాంతమున కలవాటుపడినవానిం దెచ్చి యీకర్మ సముద్రములో బడవేసినయెడల వాఁడు దానితో నడగిపోవును. వానిగతి నీటిలో చేప నొడ్డున బారవేసినట్లగును. మఱియు నీకర్మాచరణమున కలవాటుపడిన వానికి నిశ్చలమయిన యేకాంతస్థలమును బాధకరముగానే యుండును. వానికొకప్పుడు దానివలన మతికూడఁబోవును. „కర్మణ్యకర్మయః పశ్యేద

కర్మణ్యకర్మయః సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్,, అని శ్రీకృష్ణభగవానులు చెప్పినట్లు కర్మయందు శాంతిని శాంతియందు కర్మను గన్నవాఁడుత్తమపురుషుఁడు. వానికి నిరోధరహస్యము తెలియును. అతఁడు జితేంద్రియుఁడు. వాఁడలజడిగల పట్టణమధ్యమున నడుచుచున్నను కొండగుహయందువలె వాని చిత్తము ప్రశాంతమయి యుండును. అతఁడు సర్వదా పనిచేయుచునే యుండును. కర్మయోగధర్మమిది. దానిం బొందితి వా కర్మరహస్య మెఱింగినవాఁడవగుదువు

కాని మనము మొదటినుండియు ప్రారంభించి తటస్థపడిన కర్మల నన్నిటిని జేయుచుఁ గ్రమక్రమముగ స్వార్థపరత్వమును వర్జింపవలెను. మనము పనిచేసి మనమే యుద్దేశముతో చేయుచున్నామో ఆ యుద్దేశమును గనిపెట్టవలెను. మొదటిదశలో మన యుద్దేశములన్నియు స్వప్రయోజనపరములుగానే యుండుటను మనము కనిపెట్టుదుము. కాని రానురాను నది నశించి తుదకు నిష్కామకర్మ చేయఁగల వారమగుదుము. మనము ప్రయత్నము చేసిన యెడల నెప్పటికో యొకప్పటికి మనకు స్వార్థపరత్వము పోవును. అట్టి నియమము వచ్చినపుడు మనశక్తులన్నియు సమావేశమయి మనయందు జ్ఞానము వ్యక్తమగును.





# కర్మయోగము.

## రెండవ ప్రకరణము.

,,స్వస్థానమునందరు గొప్పవారే,,

## ("Each is great in his own place")



సాంఖ్యశాస్త్రప్రకారము ప్రకృతి, సత్త్వ, రజ, స్తమోగుణముల మూఁడింటిచే జేయబడినదై యున్నది. ఇది భౌతికప్రపంచమున వ్యక్తమై నిశ్చలత్వము చుఱుకు మందము లేక సోమరితనముగా నేర్పడుచున్నవి. తమస్సు అంధకారరూపమున లేక మాంద్యరూపమునను గనబడుచున్నది. రజస్సు. ఆకర్షణ వికర్షణాది కార్యరూపమును బొందుచున్నది. సత్త్వమీ రెండింటిచేతను జలింపక యుండుట.

ప్రతిపురుషునియందు నీమూఁడుశక్తులును గలవు. ఒకప్పుడు తమ మెక్కువగానుండును. అప్పుడు మనము సోమరులమయి యేమియు పని చేయకుందుము. మొద్దులవలె నగుదుము. మఱికొన్నివేళల చుఱుకుగానుండి కార్యప్రవృత్తుల మగుదుము. ఇంకను గొన్నివేళల నీరెండును సమానముగానుండును. మఱియు మనుష్యులనుబట్టి కొందరిలో నేదో యొకశక్తి యెక్కువగా నుండును. ఒకనికి సోమరుఁడయి యుండుట స్వభావము. ఒకనికి చుఱుకుప్రవృత్తి కలిగియుండుట స్వభావము. మూఁడవవానియందు నిశ్చలమై మాధుర్యమైన శాంతముండి ప్రవృత్తి నివృ

త్తులు సమానముగా నుండును. ఇట్లే సృష్టియంతటను జంతువులలోను వృక్షములలోను మనుష్యులలోను గూడ నీతివిధశక్తులు వ్యక్తమగుట ను మనము చూచుచున్నాము.

కర్మయోగ మీమూడువిషయములను గూర్చి చెప్పను. అవి యెట్టివో వానిను పయోగించుటెట్లో మనకుబోధించి యుత్తమకర్మాచరణమెట్లో కర్మయోగము చెప్పును. మానవసంఘమునన నేకతరగతులు గలవు. నీతియన నెట్టిదో ధర్మమన నేమో మనమందరము నెఱుగుదుము. కాని యొకదేశమందలి నీతికిని రెండవదేశమందలి నీతికినిగావలసినంత వ్యత్యాసముండును. ఒకదేశమున నీతియైనది రెండవదేశమున కేవలము నవినీతిగా బరిగణింపబడును. ఒకదేశమున నన్నదమ్ముల బిడ్డల నొకరికొకరిం బెండ్లి చేయుటనీతి. రెండవదేశమున నది యవినీతి. కొన్నిచోట్ల మేనమామ కొమరితనుద్వాహమగుటనీతి. కొన్నిచోట్ల నది నీతిబాహ్యము. ఒకదేశముననొక్క సారియె పెండ్లియాడవచ్చును. ఇంకొకదేశమున నెన్నిసారులైన పెండ్లిచేసుకొనవచ్చును. ఇట్లుభిన్నమై యున్నది. ఇట్లే ప్రతివిషయమునను నీతియనేకవిధములుగానున్నది. కాని విశ్వమంతటికి నొక్క ప్రమాణమైన నీతి యుండవలెనని మనమను కొందుము.

అట్లే ధర్మమును భిన్నమైయున్నది. ఇది వేఱువేఱుదేశములలో వేఱువేఱురీతులనున్నది. ఒకదేశమున కొన్నిపనులు మనుష్యుడు చేయకున్న నది తప్పుగాభావింతురు. ఇంకొకదేశమున నవిచేసినయెడల మంచిపని చేసినాడుకాడని నిందింతురు. అయినను విశ్వమంతటికి ధర్మ మొక్కటియుండవలెనని మనకు దెలియును. ఇట్లే యొకజాతివారు కొన్నిపనులు తమకు విధులనుకొని యాచరించుటయు రెండవజాతివారందుకువ్యతిరేకముగా నట్టిపనులను చేయుట దోషమని యెంచుట

యు గలదు. మనకు రెండు మార్గములు కలవు. ఒకటి మూఢులమార్గము వారు సత్యమున కొక్కటే మార్గము కలదనియు తక్కిన వన్నియు తప్పు దారులనియు తలంతురు. రెండవది జ్ఞానులమార్గము. వారు మన మనో తత్త్వమును బట్టియు మనతరగతులను బట్టియు ధర్మములును నీతియు ను భిన్నముగానుండునని ఊహించుదురు. మనము ముఖ్యముగా ధర్మము నకును నీతికినిగూడ వేఱువేఱు తరగతులుగలవనియు నొకయవస్థయందు నొకరీతిస్థితిగతులయందును ధర్మమయినది యింకొకయవస్థయందు కా నేఱవనియు తెలిసికొనవలయును. ఉదాహరణము;—గొప్పగొప్పమ తగురువులందరును "పాపము నెదిరించకుమని బోధించియున్నారు. అది యుత్తమమయిన నీతియని చెప్పియున్నారు. మనలోకొందరట్టి ధర్మము నవలంబించితిమా దుష్టులందరు చెలరేగి మనమానప్రాణములను దీసి నేసి వారి యిచ్చవచ్చినట్లు చరింతురని మనమెఱుగుదుము. అట్టియుపేక్ష నొక్కడవలంబించినను ఆపత్తు తటస్థించును. కాని స్వతస్సిద్ధముగా నది సత్యమయిన ధర్మమని మనహృదయములు విశ్వసించుచుండును. ఇది యుత్తమమయిన ధర్మమయినట్టు కనఁబడును. గాని దీనిని బోధించుట మనుష్యకోటినంతను ఖండించుటగా నున్నది. అంతేకాక దానివలనమ నుష్యులందఱు సర్వదా తప్పుపనులను జేయుచున్నారని చెప్పివారియం తరాత్మయందు వ్యసనము గలిగించిన వారమగుదుము. దానివలన వారు బలహీనులగుదురు. అట్టి స్వనిరసనమువలన నన్నింటికంటెను న క్కువకీడు సంభవించును. తనున్నతాసందించుకొను వాఁడు త్వరలో నశిం చును. ఒక దేశము విషయమును నిదిసత్యమగును.

ఆత్మద్వేషము లేకుండుట మన మొట్టమొదటి ధర్మము.. వృద్ధి నొందవలయుననిన మొట్టమొదట మనయందును, తరువాత భగవంతు నియందును విశ్వాసము నుండవలెను. తనయందు తనకు నమ్మకము లేని

వానికి భగవంతునియందెన్నఁడును నమ్మకము కుదురదు. కావున మనకు కర్తవ్యమేమనిన ధర్మమును నీతియును స్థితిగతులనుబట్టి వేఱువేఱుగా నుండునని యెంచుట. పాపమున కెదిరించువాఁడు సర్వదా పాపకర్ముఁడుగా నుండకపోవుటయేగాక యాతఁడున్న స్థితిగతులనుబట్టి పాపము నెదిరించుట యతనికి ధర్మముకూడ నగుచుండును.

భగవద్గీతచదువునప్పుడు రెండవయధ్యాయమున శత్రువులందరు తన మిత్రులు బంధువులునగుట, యుద్ధముచేయననియును అపకారమునకుఁ ప్రతీకారము చేయకుండుటయే యుత్తమ ధర్మమనియు జెప్పగా నర్జునునిఁగపటివని శ్రీకృష్ణభగవానుఁడు నిందించుట పాశ్చాత్యుల కాశ్చర్యముగా నుండవచ్చును. ఇది మనమందరము విధిగా నేర్చుకొనవలసిన విషయము. ప్రతివిషయమునను అత్యంతము లొక్కవిధముగానుండును. ద్వంద్వములు రెండును పరమావధి యందొకరీతిగానుండును. వెలుతురునిచ్చు కంపనములతిమందముగా నున్నప్పుడును మనకుగనపడవు. అతివేగముగా నున్నప్పుడును మనకుఁగనపడవు. అట్లేధ్వని కంపనములతిమందముగా నున్నప్పుడును అతివేగముగా నున్నప్పుడును మనకు వినపడవు. అట్లే యీనిరోధమునకును నిర్నిరోధమునకును భేదము లేదు. ఒకఁడు తానుచేతగానివాఁడు, సోమరియు గనుక నిరోధింపఁడు. రెండవవాఁడు తలచినయెడలమరలవేవకుండ గొట్టగలఁడుగాని యట్లు చేయఁడు సరిగదా శత్రువుల కాశీర్వాదమును జేయును. బలహీనుడయి యూరకుండినవాడుపాపమును జేసినవాఁడగుచున్నాడు. అట్టి నివృత్తివలన ప్రయోజనమేమియును లేదు. రెండవవానికట్లూరకుండక ప్రతిక్రియ జేయుట పాపమగును. బుద్ధుఁడువిరాగియై రాజ్యమునుపరిత్యజించినాఁడు. అదినిక్కమైన వైరాగ్యముకాని బిచ్చగాడై యేమియు లేనివాఁడు సర్వమునుత్యజించినాడనినచ్చుట వైరాగ్య ప్రశంసయే లేదు. గనుక

నివృత్తి సర్వదయాళుత్వమనినప్పుడు దానియర్థమేమో తెలిసిమాటలాడవలెను. మనకట్టిశక్తి కలదో లేదో తెలిసికొనవలెను. మనకట్టి శక్తియుండియును ప్రతిక్రియ చేయక యూరకుంటిమేని యప్పుడు మనము కరుణామయమయిన కార్యమును జేసినవారమగుచున్నాము. అట్లుగాక మనకు శక్తిలేక యూరకుండి మన దయామయత్వముచే నట్లుపేక్షించితిమనుకొని తమ్ముతాము మోసపుచ్చుకొనఁజూచువారు కేవలము విరుద్ధకర్మ నాచరించువారగుదురు. అర్జునుఁడు శత్రుసైన్యముల ప్రాబల్యమునుజూచి భయపడియెను. అతనిదయ తనదేశమునకును రాజునకును దాను జేయవలసిన ధర్మమును మఱచునట్లు చేసినది. అందుచేతనే శ్రీకృష్ణుఁడాతనిని గపటియని నిందించినాఁడు. ,,అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే గతాసూనగతాసూంశ్చ నాను శోచన్తి పండితాః॥

కర్మయోగముయొక్క ప్రధానభావమట్టిదిగానున్నది. నివృత్తి యుత్తమధర్మమనియు నిది యేతనయందు వాస్తవముగానున్న శక్తిని చక్కగా వినియోగపరచుటయనియు పాపమునడఁగద్రొక్కుటకై ప్రయత్నించుట యీఘనమైన నివృత్తిశక్తిని వ్యక్తపరచుటకొకమెట్టు వంటిదనియు నెఱింగినఁవాఁడు కర్మయోగియగుచున్నాఁడు. ఈస్థితికి రాకుండనున్నంతవఱకు పాపశిక్షణమె మనుష్యునికి ధర్మమగుచున్నది. పనిచేసిపోరాడి బాహాబాహిరణమొనరింపనిమ్ము. అట్టిప్రతీకారమునకు దగినశక్తి లభించునప్పుడే యప్రతీకారము పుణ్యకార్యముగాని యంతవఱకునుగాదు. ఒకప్పుడు నాకొక మూర్ఖుఁడు కనపడినాఁడు. అతడు, శుద్ధయవివేకి. అతనికేమియుఁ దెలియదు. తెలిసికొందమను నభిలాషయును లేదు. పశుప్రాయుఁడై యుండెను. వాఁడు నాకడకువచ్చి భగవంతుని దెలిసికొను టెట్లు? ముక్తి సంపాదించు టెట్లు? అని యడిగెను. ,, నీవబద్ధము చెప్పగలవా?" యని నేను వానినడిగితిని. చెప్పలేనని వాఁడుత్తరమిచ్చెను. అంతట నే

ను వానితో "అదిమాఁదు నేర్చుకొనుము. పశువువలెను మొద్దువలెను నుండుటకంటె నబద్ధములాడుటయు మంచిదే నీవుజడుఁడవై యున్నావు. ఈజడత్వమునకుఁ గారణము కార్యాతీతమయిన నిశ్చలతత్త్వమును గుర్తెఱింగి యుండుటకాదు. దుష్కృత్యము చేయుటకైనను నేఱనివాడవయి బండదేరియున్నావు" అని చెప్పితిని. ఇదియొక లోకాతీతమయిన వాని సంగతి. నేను వానితో బరిహాసించితిని, నాయభిప్రాయమేమనిన మనుష్యుఁడు సంపూర్ణమయిన నిశ్చలావస్థకువచ్చుటకు ముందుమనుష్యుఁడు ప్రవృత్తుండై యుండవలెను. ఎన్నివిధములచేతనయినను జడత్వమును మాన్పుకొనవలెను. ప్రవృత్తియనగా నెదిరించుటయే. మానసికమయినట్టియు శారీరకమయినట్టియు పాపముల నన్నింటి నెదిరించవలెను, అందు జయమునొందిన శాంతితటస్థించును. "ఎవరిని ద్వేషింపకుము, పాపమునుగూడ ద్వేషింపకుము." అని చెప్పుట సుకరమే. కాని దానికర్థమేమో మనకు దెలియును. మనల నందరు జూచుచున్నప్పుడు మనమట్టి ద్వేషరహితత్వమును జూపవచ్చును గాని మన మనస్సులోమాత్రమంతయు తుప్పుదేరియుండును. దానివలనఁగలగవలసిన మనశ్శాంతి మనకుండదు. అంతకంటె ద్వేషించుటయే బాగుగానుండునని యనుకొనుచుందుము. నీకు ధనాపేక్ష యుండినను ధనముకొఱకు పాట్లుపడు వానిని లోకమందరు నిందించుదురని యెఱిగియుంటివా నీవట్లు ధనమునకై పాట్లుపడ సాహసింపక పోయినను నీమనస్సుమాత్ర మెల్లప్పుడును ధనముమీఁదనే యుండును. ఇది కాపట్యము దీనివలన ప్రయోజనము లేదు, కాబట్టి లోకములోబడిసుఖదుఃఖముల ననుభవించిన తరువాత వైరాగ్యము కుదురును అప్పుడు మనశ్శాంతియు కుదురును. కాబట్టి మనకుఁగల కోరికల నన్నింటిని తీర్చుకొనవలెను. అట్లు కామములనన్నింటిని సాధించిన తరువాత వాని యల్పత్వము మనకు నాటును. అట్లు

కామముల నన్నిటిని సాధించి ప్రవృత్తిమార్గమును గడచి పోవువరకు ను నీకు మనశ్శుద్ధియు శాంతియును గలుగవు. ఈవైరాగ్యమును శాంతియు ననేకవేల యేండ్లనుండి బోధింపబడుచున్నవి. ప్రతివాడునుచిన్ననాటనుండియు వీనిని వినుచునేయున్నాడు. కాని యాపదవికి వచ్చినవారు మాత్రమెవ్వరును కానరారు. నేను లోకములో సగభాగమును జూచినాను నాకిప్పటివఱకు కట్టిమనశ్శాంతిని బొందినవారిరువదిమందియైన గనపడలేదు.

ఎవరి లక్ష్యమును వారేర్పరచుకొని దాని సాధించుట మంచిది. అది మఱియొకరి లక్ష్యమును దీసికొని పనిచేయుటకంటె సుకరముననుసాధ్యమునయి యున్నది. తనదికాక నేఱొకదాని సాధించుట సాధ్యము. ఇందుకుదాహరణ మేమనిన మన మొక పసిబిడ్డను దీసుకొని యిరువదిమైళ్లదూరము నడువుమనిన నాపసిబిడ్డ చచ్చియైనపోవును. లేదా యేబిడ్డయైన ప్రాకగలిగినను సగము చచ్చును. లోకమందు మనము సాధారణముగా చేయు పద్ధతి యిదిగానున్నది. ఒకసంఘము నందున్న మనుష్యులందరికి నొకరీతి బుద్ధియు శక్తియునుండవు. వారివారికి దగిన లక్ష్యములుండవలెను. ఒకరి నొకరాక్షేపించగాదు. ఎవరి లక్ష్యమును వారు సాధించుకొనుటకు శక్తికొలది పాటుపడవలెను. ఒకరి ప్రమాణమునుబట్టి మఱియొకరిని పరీక్షించుటయు సరికాదు. మామిడిపండునుబట్టి కొబ్బరికాయను పరీక్షింపవచ్చునా మామిడికాయకు మామిడికాయయే పోలిక. కొబ్బరికాయకు కొబ్బరికాయయే పోలిక. భేదమందైక్యము సృష్టిధర్మమయి యున్నది. స్త్రీపురుషులలో ప్రత్యేక ప్రత్యేకముగా నెన్ని భేదములున్నను అందరికిని సామాన్యమయిన ధర్మమొకటికలదు. వేరువేరుమనుష్యులును స్త్రీపురుషుల జాతులను సృష్టియందు సహజమయిన భేదములు కాబట్టి వారినందరి నొ

క్షే ప్రమాణముతో బరీక్షించుట సరికాదు. అట్టిది వట్టి యస్వాభావిక మయిన ప్రియాసగానుండును. దానివలన మనుష్యుని కాత్మద్వేషము పుట్టును. దానివలన ప్రయోజనము శూన్యమగును. కాబట్టి ప్రతివానిని దనలక్ష్యము ననుసరించి ప్రయత్నించునట్లు ప్రోత్సహించవలెను. అలక్ష్యము సత్యమునకు వీలయినంత సమీపముగానుండునట్లు చేయవలెను. హిందువులనీతి శాస్త్రములలో నీయంశము చిరకాలముక్రిందటనే కనిపెట్టబడినది. వారిమతగ్రంథములలోను నీతిశాస్త్రములలోను గృహస్థు, సన్యాసి, బ్రహ్మచారి, మొదలగువారికి భిన్నమయిన ధర్మములు విధింపబడియున్నవి.

హిందూ ధర్మశాస్త్రముల ప్రకారము ప్రతిమనుష్యునకును గొన్ని ప్రత్యేకమయిన విశేషధర్మములుగలవు. హిందువులజీవితము విద్యార్థిదశతో బ్రారంభమగును. తరువాత నతఁడు వివాహమాడి గృహస్థుఁడగును. వార్ధకమున వానప్రస్థుఁడగును. తుదకు లోకమునువర్జించి సన్యాసియగును. ఈప్రతియాశ్రమమునకును కొన్నిధర్మములుగలవు. ఇందెవ్వియును స్వతస్సిద్ధముగ నొకదానికంటె నొకటి యధికమయినవికావు. గృహస్థుఁడెట్టివాఁడో బ్రహ్మచారియు నట్టివాఁడే గాని యొకనికంటె నొకఁడు గొప్పవాఁడుకాఁడు. వీధితుడుచు ఛండాలుఁడు సింహాసనము పైనుండు రాజువంటివాఁడేగాని హీనుఁడుగాఁడు. వానిసింహాసనమును దీసివేసి వానిచేత వీధులు తుడిపించిచూచిన వాఁడెట్లుండునో తెలియగలదు. అట్లే ఛండాలుని గద్దెనెక్కించిన నాతఁడు పరిపాలనమును జేయును. లోకమును వర్జించి యడవులలోనుండువాఁడు లోకమందున్నవానికంటె గొప్పవాఁడనుకొనుట వ్యర్థము. లోకమును పరిత్యజించి సుఖముగా కాలక్షేపముచేయుటకంటె లోకమందుండియు, భగవంతుని సేవించుట మిక్కిలి కష్టతరము. ఈనాలు గాశ్రమములను

శాసనాను రెండు ఉనవి. గృహస్థు, సన్యాసియు. గృహస్థుడయిన వాఁడు వివాహముచేసికొని పౌరధర్మములను నివర్తించును. సన్యాసి కేవల మతపరాయణుండై భగవంతుని సేవించుచు మతమును బోధించుచుండును. మహానిర్వాణతంత్రమునుండి కొన్ని వాక్యములను మీకు జదివి వినిపించెదను. దానింబట్టి గృహస్థుగానుండి తనవిధులన్నియు యథావిధిగా నెఱవేర్చుకొనుటెంతకష్టమో మీకుఁ దెలియగలదు.

గృహస్థుడు భగవద్భక్తుఁడై యుండవలెను. భగవంతునిగూర్చిన జ్ఞాన సంపాదనమే యతని జన్మకుపరమావధిగా నేర్పఱచుకొనవలెను. అతడు సర్వదా కర్మిష్ఠుఁడై తనవిధులనన్నింటి నాచరించుచుండవలెను. తా జేసిన కర్మలనన్నింటికి ఫలము భగవంతునికి నివేదించవలెను.

ఫలాపేక్షవినాకర్మచేయుట చాల దుష్కరమైనపని. ఒకని కుపకారముచేసి యాతనివలన కృతజ్ఞత నపేక్షింపకుండుటయు యే దేని సత్కార్యము నొనరించి దానివలన పేరు ప్రతిష్ఠలనుగోరకుండుటయు నిట్లు కర్మాచరణముచేయుట చాలకష్టము. లోకము స్తుతించుచున్నప్పు డెంతటిభీరుఁడైనను ధీరుఁడగును. శూరత్వముగలుగును. సంఘములోని వారందరును దన్ను పొగడుచున్నప్పుడుమూర్ఖులుసహితము గొప్పపనుల ను జేయగలరు. కాని ప్రజల యామోదమును సరకుచేయక సర్వదా సత్కార్యముల నాచరించుటకు మనుష్యుఁడెంతయో స్వార్థత్యాగియై యుండవలెను. కుటుంబభరణమునకై ద్రవ్యమునుసంపాదించుట కుటుంబికి విధాయకమేగాని దానిని కల్లలాడియు నితరులను మోసపుచ్చియు నొరులదోచుకొనియు మాత్రము సంపాదించరాదు. తాజీవించియుండు ట భగవత్సేవకొఱకును మానవసేవకొఱకునని తెలిసికొనవలెను.

తల్లిదండ్రులు ప్రత్యక్షదైవములనియెంచిగృహస్థు సర్వదా వారిని సంతుష్టిపరుపవలెను. తనవలన తల్లిదండ్రులు సంతోషించిరేని భగ

వంతుఁడును సంతోషింపును. మాతాపితల కప్రియములు పలుకనివాఁ డుత్తమపుత్రుఁడు.

తల్లిదండ్రులయెదుట నెప్పుడును పరిహాసవాక్యములు పలుకరాదు. చిరాకును గనుపరుపరాదు. కోపమును విసుగుదలను గనబరుపరాదు. తల్లిదండ్రులముందు వారికి నమస్కరించి వారియెదుట లేచి నిలిచి వారు సెలవొసంగువఱకును నాసీనుఁడు కారాదు. కుటుంబి తనకన్న ముందుగా తల్లిదండ్రులకు బిడ్డలకు, భార్యకు, పేదలకు, బెట్టకుండ తానన్న వస్త్రముల ననుభవించెనేని పాపాత్ముఁడగుచున్నాడు. తల్లిదండ్రులీ దేహమునకు గారణభూతులుగా నున్నారు గావున వారికొఱకై యెన్నిశ్రమలకైన నోరువవలెను.

తనభార్యయెడలగల విధులునట్టివే. ఆమెనెన్నఁడు నిందింపక మాతృభావముతో జూచుచుండవలెను. తానెంతటి యాపత్తులో నున్నను భార్యపై కోపపడరాదు. పత్నినిగాక యన్యకాంతను మనస్సుచేతనైనను బొందినవాఁడు నరకమునఁబడును.

స్త్రీలయెదుట నసంగతప్రసంగము చేయరాదు. తనశక్తిసామర్థ్యములనుగూర్చి డంబములు పలుకరాదు. "నేనిది చేసితి నదిచేసితి నని" చెప్పరాదు.

కుటుంబియగువాఁడు ధనవస్త్రాభరణాదులచేతను భక్తివిశ్వాసములచేతను అమృతోపమానములయిన వాక్యములచేతను భార్యను సంతోషపరుపవలెను. ఆమెకెన్నడును విచారమును గలిగించరాదు. పతివ్రతయగు దనపత్నియొక్క ప్రేమను సంపాదించుకొనఁగలిగిన వానికన్ని పుణ్యములును సమకూరును.

ఈక్రింద చెప్పబడినవి బిడ్డలయెడల జరుపవలసిన విధులు.

కొడుకునకు నాలుగు సంవత్సరములు వచ్చువఱకు నింభార్థ

గౌరవముతో బెంచవలెను. పదునారు సంవత్సరములు వచ్చువఱకు విద్యజెప్పించవలెను. ఇరువదియేండ్లు వచ్చినతరువాత నేదైన వ్యాపారమును బ్రవేశపెట్టవలెను. తరువాత వానిని దనతో సమానముగా ప్రేమగలిగి యాదరించవలెను. ఇట్లే కుమార్తెనుగూడ సంరక్షించి విద్య చెప్పించవలెను. వివాహముచేసినప్పుడామె కాభరణములును ధనము నీయవలెను.

తరువాత తన యన్నదమ్ములయెడలను, అక్కచెల్లెండ్రయెడలను, పేదలగువారి బిడ్డలయెడలను, తక్కినబంధువులయెడలను సేవకులయెడలను, మిత్రులయెడలను, జూపవలసిన ధర్మములుగలవు. వీనితరువాత తనగ్రామవాసిజనములును, పేదవారును, తనసాయ మపేక్షించి వచ్చినవారును, ఆదరణీయులు. ఉపపత్తియుండియు, దనబంధువులను పేదలకును బెట్టలేనివాడు పశువగాని మనుష్యుడు కాడు. తనయన్న వస్త్రాదుల విషయమునను, శరీరపోషణ విషయమునను జుట్టు దువ్వుకొనుట మొదలగువానియందును, మితిమీరిన యాసక్తి కూడదు.

గృహమేధి మనస్సునందును, శరీరమందును, పరిశుద్ధుడైన సర్వదా కర్మరతుడై కర్మాచరణమునకు సంసిద్ధుడై యుండవలెను.

శత్రువులయెడల శూరుడై యుండవలెను. అప్పుడు వారినెదిరించవలెను. అది వాని వృత్తికి విధి. ఒకమూలకూర్చుండి రాగములు పెట్టుచు క్షమయుత్తమ మని లేనిపోని వ్యర్థప్రలాపములు పలుకరాదు. శత్రువులకుదనచేవ జూపక యున్నవాడుతనధర్మమును నెఱవేర్చినవాడు కాడు. శత్రువులకు సింహమువలెను బంధుమిత్రులయెడల పరమసాధువగు గంగిగోవువలెను నుండవలెను. దుష్టులను గౌరవించకుండుట కుటుంబికి ధర్మము. అట్లుగౌరవించినయెడల దుర్మార్గమును పోషించినవాడగుచున్నాడు. అల్పులయినవారిని, పుణ్యపురుషులను

గౌరవింపకుండిన దోషమువచ్చును. వేగిరపడి మైత్రినెఱపరాదు. ప్రతిచోటను స్నేహముచేయుచు, తప్పుచేయుచు, తప్పుత్రోవల బోరాదు. తానుస్నేహముచేయఁ దలచినవారి చర్యలను వారికితరులతో గల సంబంధముల స్వభావమునుగనిపెట్టి బాగుగా వితర్కించి పిమ్మట స్నేహముచేయవలెను.

మూఁడువిషయములనుగురించి తానుమాటాడరాదు. తనభార్యలనిగూర్చి బహిరంగముగా, ప్రసంగించరాదు తనప్రతిష్ఠనుగాని శక్తినిగాని యందరకును జెప్పకొనరాదు. తనధనమునుగూర్చి జెప్పకొనరాదు. తనకుదెలిసిన రహస్యమును వెల్లడించరాదు.

తాను దరిద్రుఁడననిగాని భాగ్యవంతుడననిగాని చెప్పుకొనరాదు. తనభాగ్యమునుగూర్చి డంబములుకొట్టరాదు. మంత్రరక్షణముచేయవలయును. అది తనకుధర్మము. ఇవి కేవలము నిహమునకు మాత్రమే యుపయోగించు ధర్మములు కావు. వీనిని మీరినవాఁడు దుర్వ్యసీతుఁడగును. గృహస్థు సంఘమునకు తనకునాధారము మునమూలపురుషుఁడు. అతఁడు ప్రధానమయిన సంపాదకుఁడు. దరిద్రులు, బలహీనులు, బిడ్డలు, పనిచేయని స్త్రీలు నందరును వానియాధారమునఁ జీవింతురు. కాఁబట్టి యాతఁడు చరించవలసిన ధర్మములుకొన్ని యుండవలెను. ఈ కర్మాచరణమాతనికి తగిన యుత్సాహమును, శక్తిని గలిగింపవలెను గాని వీనివలనఁదాను తనపరమార్థధర్మమునకుఁ బనికిరానికార్యమును జేయుచున్నానని యెంచుకొనరాదు కాబట్టి తానేదియైన తప్పుచేసినను దానినిబహిరంగముగా నందరిలోనను జెప్పరాదు. తానేదియైన కార్యమును జేయుచుండి యందుతాను కృతార్థతనొందనేఱనని యెఱిగియున్నను అట్లువెల్లడిచేయరాదు. అట్టి స్వాగర్హణమువలన ప్రయోజనములేదు. సరికదా దానివలన మనుష్యుని కుత్సాహమునశించి విధ్యుక్త

తులయిన ధర్మములను నెఱవేర్పశక్తి లేకపోవును. ఇట్లుచేయుచు లోక ప్రవృత్తుఁడై యుండి జ్ఞానముతో ధనమును సంపాదించుచుండవలెను. అది యతనిధర్మము. తనధర్మము నాచరించనివాఁడు వ్యర్థుఁడు. ధన సంపాదనముచేయని కుటుంబి యవినీతుఁడు. తానుసోమరియై విద్యా పారము గానుఁబట శ్రోతృప్తి గొందినయెడల వాఁడవినీతుఁడగును. తానెంద రికో యాధారముగా నుండవలసినవాఁడయి యున్నాఁడు. తాఁ భాగ్య వంతుఁడైనయెడల వందలకొలఁదిమంది తనమూలమునఁ జీవించుదురు.

ఇప్పుడేపట్టణమున ననేకులు భాగ్యవంతులయి యుండకపోయిన పక్షమున నీధర్మశాలలు, నాగరికతమేడలు, మిద్దెలు మొదలగునవి యుండుటెట్లు?

ఆప్రకారము ధనార్జనముచేయుట చెడ్డపనికాదు. ఆధనము త్యాగముకొఱకు గనుక దానసేగి లేదు. గృహస్థు మానవకోటికి మూల మయినవాఁడు, ధర్మము తప్పక ధనమార్జించి ధర్మముకొఱకు దాని వ్యయపరచుటే వానికి భగవదారాధనము. అరణ్యములయందుండి తప స్సుచేయు సన్యాసి కెట్టిముక్తి కలుగునో వీనికినట్టిముక్తియే కలుగును. ఇరువురును దైవభక్తితో స్వార్థత్యాగమును జేయువారయి యున్నారు.

కుటుంబి సర్వవిధములచేతను మంచికీర్తిని సంపాదించుకొనుట కుఁ బ్రయత్నించవలెను. వాఁడు దుష్టసహవాసము చేయరాదు. జూద మాడరాదుఅసత్యము పలుకరాదు. ఇతరులను బాధింపరాదు.

మనుష్యులుతరచుగా, దమకలవిగానిపనులనుఁ దలపెట్టి తమ కార్యమును సాధించుటకై యితరులను మోసపుచ్చుదురు, అన్నిటి యందును కాలము ప్రధానముగానుండును. ఒకకాలమున నష్టమయిన ది యింకొకకాలమున లాభకరముకావచ్చును.

కుటుంబి సత్యముపలుకవలెను, శాంతముగా మాటలాడవలెను

తనకక్కఱకు లేని యితరుల ప్రశంసచేయరాదు.

తటాకములు త్రవ్వించుటవలనను దారిప్రక్కల చెట్లు పాతించుటవలనను మనుష్యులకును, పశువులకును విశ్రాంతి గృహములను గట్టించుటవలనను, ఘంటాపథములు వేయించుటవలనను, వంతెనలు గట్టించుటవలనను గృహస్థు ఉత్తముఁడయిన యోగిపొందెడుగతులను బొందగలఁడు.

కర్మయోగసిద్ధాంతమునందీ గృహస్థధర్మ మొకభాగము. తరువాతభాగములో గృహస్థు తనదేశముకొఱకుగాని మతముకొఱకుగాని పోరాడుచు రణరంగమున ప్రాణములు విడిచినయెడల సమాధినిష్ఠుఁడగు యోగులుపొందుగతిని బొందునని చెప్పబడినది. దీనింబట్టిచూడగా నొకనికి ధర్మమైనదింకొకనికిఁ గాదని తెలియవచ్చుచున్నది. మఱియు నొకధర్మ మధమమైనదియు నొకటి యుత్తమమయినదియుఁగూడ కాదు. దేనిచోట నది విధాయకము గనుక స్థితిగతులనుబట్టి యన్నిధర్మములనుగూడ నాచరింపవలెను.

దీనినిబట్టి యొకయభిప్రాయము తేలుచున్నది. అదియేదియనిన సకలమయిన దుర్బలమును నిరసించుట. ఈయభిప్రాయమనిన మనశాస్త్రములన్నింటిలోను నాకెక్కువసంతోషము. వేదములను జదివినవానియందును నిర్భయత్వము మాటికిమాటికి బోధపడుచుండును. భయపడుట దుర్బలలక్షణము. మనుష్యుఁడు తనధర్మముల నాచరించునప్పుడు లోకుల పరిహాసనిరసనములకేమియు లక్ష్యముచేయరాదు.

ఒకఁడు లోకమును త్యజించిన లోకమునందేయున్న తక్కినవారలందరు భగవంతుని నారాధనము చేయుచుండుటలేదని తలంపరాదు. అట్లే లోకమునందున్నవారును, లోకమును విడిచిపెట్టినవారిని దేశద్రిమ్మరులయిన యధములనియు దలంపరాదు. ఎవరి దశయందు వారు

ఘనులు. ఈవిషయమునకుఁ దార్కాణముగా నేనొకకథను జెప్పెదను.

ఒక రాజు తనదేశమునకువచ్చిన సన్యాసులనందరిని "లోకమును త్యజించిన సన్యాసి గొప్పవాఁడా? గృహస్థాశ్రమమునయుండి యథావిధిగా తనధర్మములన్నింటి నాచరించువాఁడు గొప్పవాఁడా? చెప్పుమని యడుగుచుండెను. అనేకమంది జ్ఞానులీ ప్రశ్నకుసమాధానము చెప్పఁ బ్రయత్నించిరి. కొందరు సన్యాసి గొప్పవాడనిరి అందుమీఁదటఁ దాని ఋజువుచేయుమని రాజు నిర్బంధించి వారట్లుచేయ నేరకపోయినప్పుడు మీరు పెండ్లాడి గృహస్థులు కావలసినదని బలవంతముచేయుచుండెను. మఱికొందరు సన్యాసులు గృహస్థు గొప్పవాఁడనినవారినిగూడ యట్లే ఋజువడిగి వారుకనపరచలేకపోయినప్పుడు వారినిగూడ గృహస్థులనుగా నుంచుచుండెను.

తుదకొక యోగివచ్చెను. వానినిగూడ నీప్రకారమడిగిన నాతఁడు రాజా! ఇద్దరునుగూడ గొప్పవారే! యనిచెప్పెను. అందుమీఁదట రాజుదానిని ఋజువుచేయుమనెను. అందుకు సన్యాసి "అట్లే ఋజువుచేసెదనుగాని కొన్నిరోజులునీవు నాతోనే నుండినట్లుండవలెను. అట్లుండిన నేను చెప్పినవిషయమునునీకు ధృవపరచగలను" అని చెప్పెను. రాజందుల కంగీకరించి యాసన్యాసితో ననేకదేశములుతిరిగి తిరిగి వారిరువురును తుదకొక గొప్పరాష్ట్రమునకువచ్చిరి. అక్కడనొకగొప్ప యుత్సవము జరుగుచుండెను. వాద్యములధ్వని వీరికివినవచ్చెను. ప్రజలందరు మంచిదుస్తులు గట్టికొని వీధులనలంకరించిరి. ఒకఁడు పెద్దధ్వనితో చాటింపుచేయుచుండెను. రాజును సన్యాసియు జరుగుచున్న వేడుకనుఁ జూచుటకై యచ్చటనిలిచియుండిరి. ఆచాటింపువాఁడు రాజకుమార్తె యచ్చట సమావేశమైనవారియందొకని దనయిచ్చవచ్చినవానిని వరియించునని చాటుచుండెను.

ఇట్టి స్వయంవరవివాహములు పూర్వము హిందూదేశమున నాచారమైయుండెను. తనకిట్టివరుఁడు కావలయునని ప్రతిరాజకుమార్తెయును గోరుకొనుచుండును. కొందరతిసుందరులయిన పురుషులను వరింతురు. కొందరు విద్యాధికులను గాంక్షింతురు. మఱికొందరు భాగ్యవంతుల నపేక్షింతురు. ఆప్రాంతములనున్న రాజన్యులందరు సొగసైన వస్త్రములను ధరించి యాకన్యయెదుట నాసీనులై యుందురు. ఒక్కొక్కప్పుడు వారివారివిశేషములను హెగ్గడులు హెచ్చరించుచుందురు. వధువు సింహాసనముపై నాసీనయై చుట్టును దిరిగి యందరినివీక్షించి వారివారి విశేషములను వినును. తనకిష్టము లేకయున్నచో ముందుకు పదమని వాహకులకాజ్ఞ నొసంగును. ఇట్లంగీకరింపఁబడనివారినింక సరకు సేయరు. ఇట్లుతిరిగి తావరించుంచినవాని మెడలో నొకపూలహారము వేయును. అంతట నాతఁడామెకు ధవుఁడగును.

ఇప్పుడు మనరాజును సన్యాసియు వచ్చిన రాష్ట్రమునసిట్టి స్వయంవరమహోత్సవము జరుగుచుండెను. ఆకన్య లోకములోనికెల్ల చక్కనిది. ఆమెవరించినవాఁడామె తండ్రిరాజ్యమునకు రాజగును. ఆకన్యయుద్దేశము, లోకైకసుందరుఁడగువాని వరింపవలెననియుండెను గాని యట్టివాఁడెవ్వఁడును గనిపింపఁడయ్యెను. ఇట్టిసభలనేకపర్యాయములు జరిగెను గాని యెన్నఁడునామె యెవ్వరిని వరింపలేదు. ఈసభయున్నిటికంటెను గొప్పవైభవముతోఁ జరుగుచుండెను. దీనికన్నిటికంటెనెక్కువమందివచ్చిరి. ఆకన్యరత్నసింహాసనముపై నెక్కివచ్చెను. బోయిలామె నొకరాజకుమారుని కడనుండి యొకనికడకుఁ ద్రిప్పుచుండిరి. ఆమె యెవ్వరిని సరకుచేయలేదు. ఈసభకూడ మునుపటివలె వ్యర్థమని నిరాశులయిన రాజకుమారు లనుకొనుచుండిరి. అప్పుడే యొకసన్యాసి నభోమండలమునుండిదిగిన సూర్యునివలెవచ్చి యొకమూలగూరుచుండి జరుగు

చున్న వేడుకనుజూచుచుండెను. రాజకన్య సింహాసనమకడకు వచ్చెను. వచ్చినతోడనే యామె యాసన్యాసిమెడలో పూలహారము వైచెను. ఆసన్యాసి యాదండనుదీసి పారవైచి „యేమిది నేనుసన్యాసిని నాకు వివాహమెందులకని కేకలువేసెను. అతఁడు పేదవాఁడగుట తన తన యను బెండ్లియాడ సందేహించుచున్నాఁడనియెంచి యారాజు నాతో మాత్రతోఁగూడ నారాజ్యమున సగపాలువచ్చును. నాయనంతరమున రాజ్యమంతయు వచ్చునని చెప్పి మరల పూలహారమును వానిమెడలో వేసెను. ఆయోగిమరల దానినూడదీసి „ఛీ నేనువెండ్లియాడువాఁడ గానని'' చెప్పి సభవిడిచిపోయెను.

అంతట నారాజపుత్రిక వానియందు బద్ధానురాగయై „వీనిని బెండ్లియాడవలెను. లేకమృతినొందవలెనని నిచ్చయించుకొని వానితోఁ గూడ జనెను. మనరాజునుదీసికొని మనసన్యాసి వారినిరువురిని వెంబడించెను. ఇట్లువారు చాలా దేశముఁగడచి చనిరి. ఆపడుచుసన్యాసి యొక యడవిలోఁ బ్రవేశించెను. రాజపుత్రికయు వానిననుసరించెను. రాజును సన్యాసియుఁగూడ వెంటఁబోయిరి. ఆపడుచుసన్యాసి ఆయరణ్యమందలి చిక్కుదారులనన్నింటి నెఱింగినవాఁడగుట నొకదానినుండి యొకదానిలోఁ బ్రవేశించి తుదకదృశ్యుఁడయ్యెను. రాజపుత్రిక వానిననుసరింపలేక వెదకివెదకి వేసారియొకచెట్టుక్రింద గూరుచుండి యేడువసాగెను. ఆమెకెటుబోవుటకును దారితెలియదు. అంతటరాజును సన్యాసియు నామెనుజేరి „అమ్మా ఏడువకుము. ఈయరణ్యమునుండి నిర్గమించుమార్గమును మేమెఱుఁగుదుము. ఇప్పుడు చాలచీకటిగా నున్నందున నిప్పుడేమియుఁ గనబడుటలేదు. ఇక్కడనొక పెద్దవృక్షముకలదు. దీనిక్రింద విశ్రమించుదము. ఉదయముకాగానే లేచి నీకుమార్గము జూపెదము అనిచెప్పిరి.

ఆ చెట్టుమీదగూడుకట్టుకొని యొకపక్షి మిథునమును మూడు పిల్లలును నివసించుచుండెను. ఆపక్షి చెట్టుక్రిందనున్న ముగ్గురినిజూచి తనభార్యతోనిట్లు చెప్పెను. "ప్రేయసీ ఇచ్చట ముగ్గురతిథులున్నారు. సీతకాలము ఎచ్చటనునిప్పులేదు ఏమిచేయుదము" అనియెగిరిపోయి యొకకొఱకంచును నోటఁగఱచితెచ్చి యతిథులముందు బడవైచెను. వారుదానిని రాజబెట్టుకొని మంటచేసికొనిరి. కానిదానితో ఆపక్షికి తృప్తికలుగక మరలభార్యనుజూచి "ప్రేయసీ వీరాకలిగొనియున్నారు వీనికిఁబెట్టుటకేమియును లేదు. ఏమిచేయుదును. మనము గృహస్థులము. అతిథిపూజమనకు విధియైనధర్మము. నాకుచేతనైనది చేయవలెను. గనుక నాశరీరమును వారికర్పించెదను" అనిచెప్పి యానిప్పులలోనికుఱికి మృతినొందెను. అతిథులు దానినిపడుచుండగాజూచి రక్షింపబోయిరి గాని వారుప్రయత్నించులోపలనది మంటలలోఁబడిపోయెను.

ఆపక్షిభార్య యదిచూచి యిచ్చటముగ్గురతిథులున్నారు. ఒక్కపక్షివీరికిఁజాలదు. నాభర్తప్రయత్నము విఫలముగాకుండ జూచుటగృహిణినైన నావిధాయకము. నాశరీరముగూడ వారికిచ్చెదనుగాక యని యదికూడ నిప్పులలోబడి మృతినొందెను.

ఇట్లు తల్లిదండ్రులుచేసిన పనిజూచి పిల్లలుమూడును అతిథులకాహారము చాలకుండుటఁగాంచి "మనతల్లితండ్రులు వారిశక్తికొలది చేసిరి. దాననతిథులకుఁ దృప్తికలుగలేదు. వారుతలపెట్టినకార్యమును సాంతముచేయుట మనకుధర్మము. మనశరీరములుగూడ వారికర్పణమగుగాకయని యవికూడ నగ్నిలోఁబడెను.

వీనింజూచి యతిథులాశ్చర్యపడి వానినిఁదినలేకపోయిరి. ఆరాత్రి యుపవసించి యుదయముననేలేచి రాజును సన్యాసియుఁ దారిఁజూప, నారాజపుత్రిక తండ్రియింటికిబోయెను.

అంతట సన్యాసి రాజుతో నిట్లనియె ‹‹రాజా! చూచితివా ఎవరిస్థానమున వారుగొప్పవారు. లోకమున నివసించదలఁచితివా యీపక్షులవలె పరులకొఱకు ప్రాణములనర్పింప సర్వదా సమర్థుఁడవయి యుండుము. లోకమునుద్యజించఁగోరితివా లోకైకసుందరియగు స్త్రీని రాజ్యమును దృణప్రాయముగా నెంచిన యాసన్యాసివలె విరాగివై యుండుము. గృహస్థుఁడవై యుందువేని సర్వదా పదార్థపరుఁడవును, స్వార్థత్యాగివియునై యుండుము. అట్లుగాక వైరాగ్యము నవలంబింప నెంచితివో కాంతాకనకాధికారాదులను గంటఁజూడనైనఁజూడకుము. ఎవరివరియందు వారుఘనులు. ఒకనికి ధర్మమయిన దింకొకనికి కాదు.





# కర్మయోగము.

మూడవ ప్రకరణము.

## కర్మరహస్యము.

("The secret of work")

ఒరులకు లౌకిక కార్యములయందు సాయమొనరించి యుపకారముచేయుట గొప్పపనియే. కాని కార్యగౌరవమునుబట్టి సహాయగౌరవముకూడ నతిశయించును. ఒకనికొకగంటసేపటికిఁ గావలసిన ద్రవ్యమునిచ్చుటయు సాయమే. ఒకసంవత్సరమునకుగావలసిన ద్రవ్యమిచ్చుటంతకంటె నెక్కువయుపకారమగును. ఎప్పటికిని లోటులేకుండఁ జేసినయెడల వానికిఁజేయదగిన యుపకారమంతకంటె వేరేదియునులేదు. అట్టిశాశ్వతసుఖమును మనకుఁగలిగించునది. పరమార్థజ్ఞానము లేక ఆత్మజ్ఞానముమాత్రమే యయియున్నది. తక్కినయేజ్ఞానమయినను గొంతకాలముమాత్రమే సుఖమిచ్చును. ఆత్మజ్ఞానముతోడనే మనుష్యునకుండు లోటులన్నియుఁదీరును. కాబట్టి జ్ఞానోపదేశము చేయుట పరమోపకారము. అట్టిజ్ఞానము నుపదేశించినవాఁడు మానవకోటికంతకును మహోపకారము నొనరించినవాఁడగును. అట్టివాడే గొప్పశక్తి గలిగినవాఁడయి యుండుటను మనముజూచుచున్నాము. మనప్రవృత్తులకన్నిటికిని ఆత్మజ్ఞానమే మూలాధారము. ఆత్మబలముగలవాఁడన్నిటను బలవంతుఁడేయయి యుండును. ఆత్మబలములేనిచో భౌతికపు

లోపములయినను సరిగాదీరవు. ఆత్మసహాయమునకుఁ బిమ్మటివి బుద్ధి సహాయము. అన్నవస్త్రములనిచ్చుటకంటె జ్ఞానదానముగొప్పది. ఇంతేకాక ప్రాణదానమునుకంటెను గొప్పది. మనుష్యునికిజ్ఞానమే నిక్కమైన ప్రాణము జ్ఞానశూన్యతయే మృతి. జ్ఞానమే జీవనము. అజ్ఞానాంధకారనిమగ్నమైనవాని జీవనము వ్యర్థము. కాఁబట్టి వీనికన్నిటికిదరువాత దైహికోపకారము. కాఁబట్టి పరోపకారమనినప్పుడు కేవలము దైహికోపకారమనియే, మనముతలంపరాదు. దానివలన శాశ్వతమయిన యానందము కలుగనేరదు. ఆకలివలనిబాధ యన్నముతోఁదీరును. కాని మరలనాకలి కలుగుచున్నది. అట్లుగాక యెన్నటికిని మరలఁబాధకలుగకుండఁజేసినప్పుడుగాని దుఃఖము నివారణకాదు. అప్పుడాకలివలన బాధకలుగదు. ఎట్టివిపత్తుకలిగినను మనస్సుచలింపదు కాఁబట్టి యాత్మకు బలమునుగలిగించు నుపకారమన్నిటికంటె నుత్కృష్టమైనది. దాని తరువాత జ్ఞానదానము. పిమ్మట లౌకికోపకారము.

లోకముయొక్క బాధలులౌకిక సహాయముమాత్రముచే నివారణకానేఱవు. మనుష్యునిస్వభావము మాఱువఱకును లౌకికములయిన లోపములు కలుగుచునేయుండును. వానివలన దుఃఖముకలుగుచుండును. ఎంతచేసినను అవితీరవు. మానవకోటిని పవిత్రులనుగాఁజేయుటయే దీనికిసాధనము మనముచూచుచున్న కీడునకును దుఃఖమునకునునెల్ల మూలమవిద్య. కాఁబట్టి మనుష్యులకందరికి జ్ఞానజ్యోతినిఁజూపి వారిని పవిత్రముచేసి యాత్మబలము కలిగించినప్పుడుగాని యంతవఱకును లోకమున దుఃఖమునశించదు. మనములోకమందున్న గృహములన్నింటిని ధర్మసత్రములుగాఁజేసి భూమియంతట ధర్మవైద్యశాలలును బెట్టించిననుసరే. మనుష్యులస్వభావము మార్పుజెందనియెడల లోకమున దుఃఖముండకమానదు.

మనమునిరంతరము విడువక కర్మ నాచరించుచుండవలయునని భగవద్గీతలయందుఁ జదువుచున్నాము. కర్మయంతయు రెండువిధములు. సత్కర్మకొంత. దుష్కర్మకొంత. ఎక్కడో యొకచోట నేదో కొంతయు పయోగించని కర్మను మనముచేయలేము. అట్లే యెక్కడో యొకచోట కొంతహానిని జేయని కర్మయునుండదు. ప్రతికర్మయుఁగూడ పుణ్యాపాపమిశ్రమమయి యుండవలెను. అయినను కర్మచేయుటమనకు విధిఁపఁబడుచున్నది. పుణ్యాపాపములు రెండింటికినిగూడ ఫలముండును. వానివలన కర్మకలుగుచున్నది. పుణ్యకర్మకు పుణ్యఫలమును పాపకర్మకు పాపఫలమును మనకుఁ గలుగుచున్నది. కాని పుణ్యాపాపములు రెండును గూడ ఆత్మకు బంధకారణములయి యున్నవి. అట్టిబంధమాత్మకుఁగలుగకుండ కర్మనాచరించుటకుఁ భగవద్గీతలయందుఁ జెప్పబడిన సాధనము ఫలవిరాగియై కర్మనాచరించుటయే. అట్లుచేయుటవలన మనకు బంధముకలుగనేఱదు. ఈనిస్సంగకర్మయననేమో తెలిసికొనుటకుఁ బ్రయత్నించుదము.

గీతాశాస్త్రమునందు ప్రతిపాదింపబడిన ప్రధానబోధయిది. నిత్యము కర్మనాచరించుచుండవలెను. గాని దానియందు సక్తుఁడై యుండరాదు. సంస్కారమనగా స్వభావసిద్ధమైన ధోరణి, మనస్సునొక తటాకముతో నుపమించితిమేని యందుబయలుదేరు ప్రతికెరటమును ఆరిపోవునప్పుడు పూర్తిగా నశింపక మరలనట్టి కెరటమువచ్చునవకాశమును దెలిపెడు సూచనను విడిచిపెట్టిపోవును. ఈసూచనలేక చిహ్నమునకు సంస్కారమనిపేరు. మనముచేయు ప్రతికార్యమును శరీరముయొక్క ప్రతిచలనమును ఊహించు ప్రతియూహయును మనస్సుమీఁద ముద్రింపఁబడియుండి యీముద్రలుపైకిఁ గనపడకపోయినప్పటికి లోపలనుండి విశేషముగా పనిచేయుచుండును. మన మేతఃణమున నెట్లుం

ధుమో దానికంతకును గారణమీముద్రలయొక్క సమవయమహిమ యే. నేనీక్షణమున నిట్లుండుటకుఁ మూలము నాపూర్వజన్మమునందలి యిట్టిముద్రలఫలము. స్వభావమనగానిది. మనుష్యులస్వభావమీ కర్మల ఫలమువలన నేర్పడుచున్నది. సత్కర్మఫలమెక్కువయున్న సత్స్వభావ మును, దుష్కర్మఫలమెక్కువైన దుస్స్వభావము గలుగును. ఒకడు సర్వదా చెడ్డమాటలేవినుచు చెడ్డయూహలనే చేయుచుఁ చెడుపనులు చేయుచునుండినయెడల వానిమనస్సు దుర్వృత్తులకాకరణమగును. అవి వానియూహలను కర్మలను తెలియకుండనే బాధించుచుండును. వాస్త వముచేత నీచుర్వాసన లెల్లప్పుడును పనిచేయుచునే యుండును. వాని ఫలము చెడుగుగానే యుండవలెను. ఆమనుష్యుడును చెడ్డవాఁడగును. అదితప్పదు. వాని యీదుష్కర్మలన్నింటియొక్కయు ఫలము వాని యందు దుర్మార్గపుకార్యములను జేయుటకుఁ దగిన యుత్సాహమును గలిగించును. ఆఫలమువానిని కీలుబొమ్మవలె నాడించి దుష్కార్యము లను జేయుటకు బలాత్కరించును. ఇట్లేయొకడు మంచియూహలను గ లిగి మంచిపనులను జేసినయెడల వానివలన గలుగుఫలమును మంచిదై యుండి వానిచేత బలవంతముగా సత్కార్యములను జేయించును విశేషము గా సత్కార్యములాచరించి సదూహలును గలిగినవానికి వానియందు సర్వదా సత్కార్యాచరణమున కనివార్యమైన ధోరణి యుత్పత్తియయి యాతఁడు చేయవలయుననినను దుష్కార్యమును చేయనేరనివాఁడై యుండును. అట్లుచేయుటకు వానిమనస్సు వానికడ్డువచ్చును. వానిపూ ర్వవాసనలు వానిని వెనుకకు దిప్పును. వాఁడు పూర్ణముగా సద్వృ త్తులవశమై పోయినవాఁడుగా నుండును. అట్టిస్థితిలో నున్నప్పుడు వాని స్వభావము స్థిరమైనదగును.

కూర్మము తన పాదములను గర్భములో నిముడ్చుకొని దానిని జంపినను వానిబైకి దీయనట్లు ఇంద్రియములను ఇంద్రియార్థములను

వశపరచుకొనినకాని ప్రజ్ఞ ప్రతిష్ఠితమయియుండును. అతఁడు తనయం తశ్శక్తులను స్వాధీనపరచుకొనును గనుక యవి వానియిష్టమునకు వ్యతిరేకముగా విషయములయందు ప్రవృత్తములు కావు. సంతతసదుద్దేశముల వలన మనస్సునందు సర్వదా సద్వృత్తులు తేలియాడుచు సత్కార్యాచరణానురక్తి స్థిరముగా నేర్పడి యింద్రియనిగ్రహము చేయగలుగుదుము. మనుష్యుని గుణమిట్లేర్పడుచున్నది. అప్పుడే మనుష్యునికి సత్యము దొరకును. అట్టిపురుషుఁడు సర్వదా భద్రపడియుండును. అతఁడు దుష్కార్యమును దేనిని జేయజాలఁడు. అతఁడెట్టి సాంగత్యమున నున్నను భయములేదు. ఇట్టి సద్వృత్తియుండుటకంటె నున్నతమైన దశయొకటి గలదు. అదిముముక్షుత్వము. యోగములన్నిటికి నిధానమైనది మోక్షము. అన్నిటికిని ఫలమదియే. కర్మవలననే బుద్ధుఁడు క్రీస్తుమొదలగువారు సాధించిన పదవులు లభించఁగలవు. బుద్ధుఁడు కర్మజ్ఞాని. క్రీస్తు భక్తుఁడు. వారిరువురు నొకేపదమును బొందిరి. కష్టమిక్కడ నున్నది. ముక్తియనగా సర్వమోక్షము. పుణ్యపాపములురెండింటినుండియు విముక్తి. సంకెల యున్నప్పుడు బంగారుగొలుసైనను ఇనుపగొలుసైనను నొకటే. నాకాలిలో ముల్లుగుచ్చుకొనిన దాని నూడదీయుటకు కింకొక ముల్లునుపయోగించి మొదటిది వచ్చిన తరువాత రెండింటినిగూడ బారవేయుదుము. రెండవముల్లునుంచుకొనవలసిన పనిలేదు. రెండునుముండ్లే కాఁబట్టి దుర్వృత్తులు దుర్వాసనలు నశించుటకును సద్వృత్తులు సత్కర్మలు నావస్యకములు. దీనివలన వానిఁబోఁగొట్టవలెను. తరువాత సద్వృత్తులనుకూడ జయించవలెను. ఈప్రకారముగా సంగులైన వారలు నిస్సంగులగుదురు. కర్మచేయవలయునుగాని దానియందు మన మనస్సు సక్తమైయుండరాదు. ఎంతలెంతలు కార్యములు చేయుచున్నను ఆత్మకు మాత్రము వానియందు సక్తతయుండరాదు. ఇది యేమి? సంగముండినయెడల దానిఫలము ఆత్మనంటియుండును:

నేను ప్రతిదినము ననేకవందలమందిని గలిసికొందును. అందులో గొందరు నాకుఁ బ్రియులునుందురు. రాత్రివిశ్రమింపఁ బోయినపుడు నేను జూచిన ముఖములన్నియు జ్ఞప్తికి దెచ్చుకొనవలయుననిన నేనొక్క నిమిషముతాళి ప్రేమతోఁజూచిన మొగముమాత్రమే జ్ఞాపకము నకువచ్చును. తక్కిన వన్నియు సదృశ్యములగును. ఆయొక్కని యందును నాకుఁ గలిగిన సంగమువలన నామనస్సున వానిరూపము ప్రతిబింబితమైనది. శారీరశాస్త్రప్రకారమట్టి ముద్రణము లన్నియునొక్కటే. అన్నిటిని కన్నులతో జూచుటయు నదిలోనున్న మెదడును దాకుటయు జరిగినదిగాని మన్మస్సుమీాద వాని ఫలము మాత్రము భేదముగా నుండెను. వారిలోఁజాలమంది క్రొత్తవారును నేనన్నఁడెఱుగని వారునునై యున్నారు. అందొక్కనియందు మాత్రమంతరంగమున సాంగత్యము కుదిరినది. బహుశఃవానిని చిరకాలమునుండి యెఱిగియుండి వానింగూర్చి యెన్నోవిషయము లెఱింగిన వాఁడనై వానినన్నింటిని మఱచి యుండనోపుదును. ఇప్పుడువానినిఁ గ్రొత్తగా జూచుట తోడనే యవి యన్నియుఁబైకి వచ్చెను. ఇందుకుఁ గారణము ఈయొక్క ముద్రియుద రుచు పడినదగుటఁగాటముగానాటి యుండవచ్చును.

కాబట్టి సంగవర్జితుఁడై యుండవలెను. మనమనస్సున అవయవములును నిత్యమును పనులను జేయుచున్నప్పటికి మనమనస్సున మాత్రము వానియందెంతమాత్రమును సక్తతయుండరాదు. దారిఁబోయెడు పాంథునివలె నుండవలెను. నిత్యముపనిచేయుచు సక్తతలేక యుండవలెను. బంధము ఘోరము. ఈలోకము మననివాసముకాదు. మన మార్గమున నున్న యనేకలోకములలో నిదియొకటి. ప్రకృతియంతయు నాత్మకొఱకుఁగాని యాత్మప్రకృతి కొఱకుఁ గాదని సాంఖ్యులు చెప్పినమాట మఱవరాదు. ప్రకృతియొక్క ప్రయోజన మాత్మకు విద్యగఱపుట. అంతకం

కు వేఱుప్రయోజనములేదు. ఆత్మకు జ్ఞానము కావలయును గనుకను దానివలన నాత్మముక్తిఁబొందవలయును. గనుకను ప్రకృతి యేర్పడినది. దీనినెఱిఁగియున్నయెడల మనమెన్నఁడును ప్రకృతిబద్ధులము కాము. ప్రకృతియొకపుస్తకమువంటిది. దానియందలి విషయముల గ్రహించి జ్ఞానము సంపాదించిన తరువాత మనకింక దానితోఁబ్రయోజనములేదు. అందుకుఁబదులుగా మనము ప్రకృతితో నైక్యమును బొందుచున్నాము. ఆత్మ ప్రకృతికొఱకని మనము తలంచుచున్నాము. మనము తినుటకుఁ జీవించుచున్నాముగాని జీవించుటకై తినుటలేదని తలంచుచున్నాము. ఇదిమనము సర్వదా చేయుచున్నతప్పు-మనమేప్రకృతియని యెంచియెల్లప్పుడును దానింబట్టుకొని వ్రేలాడుచున్నాము. ఇట్టిసంగమెప్పుడు కలిగినదో దానితోడనాత్మ బంధమునం జిక్కుకొని ముక్తికొఱకుగాక దాసభావముతో కర్మలను జేయునదగుచున్నది.

ఈబోధన కంతకును సారమేమనిన నీవు స్వతంత్రుఁడవై కర్మ నాచరింపవలెఁగాని దాసుఁడవై చేయఁరాదు. ఎల్లప్పుడును గర్మనాచరించుచుండవలెను గాని బానిసవలె మాత్రము చేయరాదు. అందరు నెట్లుచేయుచున్నారో చూచుచుంటివికదా. ఒకడును విశ్రాంతి నెఱుంగడు. నూటికి తొంబదితొమ్మిదిమంది బానిసలవలె పనిచేయుచున్నారు. అందులకు ఫలముగా దుఃఖమనుభవించుచున్నారు. ఆకర్మయంతయు స్వార్థపరత్వమైనది. ముక్తుఁడవై పనిచేయవలెను. భక్తిగలిగి కర్మనాచరించవలెను. భక్తియన నెట్టిదో తెలిసికొనుట దుష్కరము. స్వాతంత్రునికిఁగాని భక్తికుదరదు. బానిసవానికినిక్కమైన భక్తికుదురుట దుర్లభము. నీవొకబానిసనుగొని వానిని గొలుసులతోఁ గట్టిపెట్టి వానిచే తపవిచేయించినఁ జేయునుగాని వానికినీమీాద ననురాగమెక్కడిది? కాబట్టి మనమును బానిసలవలె నైహిక ద్రవ్యములకొఱకై పనిచేసిన

యెడల మనకును భక్తియుండదు. మనముచేయు కర్మయును నిష్కామ మయిన కర్మకానేరదు. బంధుమిత్రాదులకొఱకుఁ జేసెడు కార్యముల విషయమున నైనను మనకు మనము జేసికొనెడు కార్యముల విషయమున నైననుగూడ నిదియే నిశ్చయము. భక్తికలిగి చేసిన కార్యమువలన మనశ్శాంతియును సుఖమును గలుగక మానవు. నిష్కామమైనయునికి నిష్కామమైన జ్ఞానము, నిష్కామమైనభక్తి యువిపరస్పర సంబంధముగలవి. ఇవియే యేకమగు సచ్చిదానందము యొక్కలక్షణములు. అయునికి ప్రకృతితోఁగూడి లోకముగాను, జ్ఞానము లోకజ్ఞానముగాను, ఆనందము మానవహృదయ గోచరమగు కేవలభక్తిమూలముగాను పరిణమించును. గాబట్టినిష్కామమైన భక్తియెన్నఁడును భక్తునికిగాని ఆరాధితునికిఁగాని నొప్పిగలిగింపనేరదు. ఒకపురుషుఁడొక స్త్రీని ప్రేమించెననుము. ఆమె యెప్పుడును తనపూర్ణమయిన సొమ్ముగానుండవలయునని కోరుచు నామె కదలిననను మాన పడుచుండును. ఆమె తనకడనే కూర్చుండవలయును. దగ్గరనే నిలువవలెను. సమీపముననేభుజించవలెను. తానేమి చెప్పిన నట్లుచేయవలెను. దీనికర్థమేమి? వాఁడుదానికిఁ దాసుఁడైయున్నాఁడు. ఆమె తనకుఁదాసిగావలెనని కోరుచున్నాఁడు. అదిప్రేమకాదు. ప్రేమయని భ్రమపెట్టుచున్న యొకవిధమైన కామము. దానివలన బాధకలుగుచున్నది గావున నదిప్రేమకానేఱదు. వాఁడుగోరినదాని నదిచేయకున్న వానికి బాధగానుండును. ప్రేమయున్నచోట నట్టిబాధయుండదు. ప్రేమవలన సుఖము మాత్రమే కలుగును. అట్లుకానియెడల నదిప్రేమయేకాదు. ఏదోచూచి ప్రేమయనుకొంటగాని యదిప్రేమకాదు. భర్తనుభార్యను బిడ్డలను లోకమునంతను అసూయలేకుండ ప్రేమింపఁగలిగితివేని స్వార్థపరత్వము లేకుండ ప్రేమింపగలిగితివేని యప్పుడుసీవు సంగవర్జితుఁడవుగానుండుటకు దగినస్థితికివచ్చెదవు.

కృష్ణుఁడిట్లు చెప్పుచున్నాఁడు. అర్జునా యిటుచూడుము. నేను పనిచేయుటకొక నిమిషమునూని వేసినయెడల లోకమంతయు నశించును. కర్మవలన నాకేమియు లాభములేదు. నేనేయీశ్వరుఁడను నేనెందుకు కర్మచేయవలెను. నాకులోకమునియాదిప్రేమచేత పనిచేయుచున్నాను. భగవంతునికి సంగములేదు. ఎందుచేత? అతనికిప్రేమ కలదు గనుక నిక్కమయిన భక్తివలన సంగముండదు. ఎక్కడెక్కడ సంగముండునో యైహికవస్తువులయందు మమకారమెక్కడనుండునో యది యంతయు జడపదార్థములయందుండెడు నాకర్షణమువంటిది. దానివలన రెండు పదార్థములు నొండింటించేర్చుట కాకర్షించి దానివలన నా రెండును జేరనియెడల దానివలన బాధకలుగును. నిక్కమయినప్రేమ యున్నచోట కేవలదేహసంబంధముతో పోదు. నిక్కమయినప్రేమ యున్నవారెన్ని వేలమైళ్ళ దూరముననున్ననుసరే, వారియనురాగమునకు కొదువయుండదు. అదినశించదు. దానివలన నెన్నఁడును బాధకలుగదు. ఇట్టినిస్సంగము కుదురుటకు జన్మమంతయుపట్టును. కాని యదికుదిరిన నిమిషముననే మనుష్యుఁడు ముక్తుఁడగును. ప్రకృతిబంధము వీఁడును. అప్పుడుమనకు ప్రకృతి తథ్యమయినరూపమున గోచరించును. ఇంకనదిమనలను బద్ధులనుగాజేయఁజాలదు. అప్పుడుమనము కేవలము ముక్తులమయియుండి మనకుఁగర్మఫలమంటకుండును. దానిఫలమేమైనను మనకక్కఱలేదు.

నీవు నీబిడ్డలకేమయిననిచ్చినదానికి ప్రతిఫలముగానేమయిన నడుగుదువా? వారికై పాటుపడుటనీకువిధి. అదియంతటితోసరి. అట్లే నీవొక మనుష్యునికిఁగాని యూరికిఁగాని, దేశమునకుఁగాని యేదయిన చేసినప్పుడు నీబిడ్డలకుఁజేసినప్పుడెట్టి మనసుతోఁజేయుదువో యట్లుచేయుము. ప్రతిఫలమునేమియు నపేక్షింపకుము. నీవెల్లప్పుడును దాతవు

గానేయుండి ప్రతిఫలము నపేక్షింపకుందువేని నీకుకర్మవలన బంధము కలుగదు. ప్రతిఫలాపేక్షయున్నప్పుడే బంధముకలుగుచున్నది.

బానిసలవలె పనిచేయుటవలన స్వార్థపరతయును బంధమును ప్రాప్తమగునెడల స్వతంత్రులయి పనిచేయుటవలన నిస్సంగా నందము కలుగును. న్యాయమని ధర్మమనిపలుమారులు మనమనుచుందుముగాని లోకములో న్యాయధర్మములు పసిబిడ్డల ప్రలాపములవంటివిగా నున్నవి. మనుష్యులను నడిపించునవి శక్తి కరుణ యను రెండయియున్నవి. శక్తినివినియోగించుటయనగా స్వార్థపరత్వమును వినియోగించుటయే. స్త్రీపురుషులందరును దమకుగలశక్తియుక్తులను వినియోగించుటకే ప్రయత్నించుచున్నారు. కరుణాస్వార్థతుల్యమైనది. మనముమంచివారము కావలయునని కరుణావంతులము గావలయును. న్యాయధర్మములకైనను కరుణయాధారముగా నుండవలెను. మనముచేయుపనులకు ప్రతిఫలాపేక్ష కలిగియుండుటవలన మనయాత్మాభివృద్ధికి భంగకరము. అంతేకాక చివరకు వానివలన దుఃఖముకూడప్రాప్తమగును. ఈకరుణను స్వార్థత్యాగమయిన ధర్మమునాచరణలోనికిదెచ్చుటకింకొక మార్గముకలదు. అదియేదియనిన కర్మనే ఆరాధనముగా నెంచుకొనుట. అప్పుడుమనకర్మఫలములనన్నింటిని భగవదర్పణమునుచేయుదుము. మఱియునిట్లు భగవంతుని పూజించునప్పుడు మనము చేయుపనికి మానవకోటినుండి ప్రతిఫలమునుగోరనేరము. భగవంతుఁడు కూడనిత్యమును గర్మనాచరించుచు నిస్సంగుఁడైయున్నవాఁడు. పద్మపత్రమునకు నీరంటనట్లు స్వార్థపరుఁడుగాని వానికి కర్మఫలములంటనేరవు. నిస్సంగుఁడై పురుషుఁడెంతటి పాపసమ్మర్దమయిన పట్టణమధ్యమున నున్నను వానికిఁబాపమంటదు.

ఇట్టిస్వార్థపరిత్యాగమీ క్రిందికథవలనఁ దేటపడగలదు. కురుక్షేత్రయుద్ధమైనతరువాత పాండవు లయిదుగురు నొకయాగమును జేసి

పేదలకు విస్తారము ధనమును ధర్మముచేసిరి. జనులందరు మిక్కిలి యాద్భుతమునొంది యట్టియజ్ఞము నదివరకెన్నడును వినికని యెఱుంగమని చెప్పుకొనఁజొచ్చిరి. ఇట్లుండనచ్చటికొక యుడుతవచ్చెను. దానిమేనసగము బంగారమై తక్కినసగము ధూసరవర్ణముకలిగియుండెను. అదియజ్ఞవాటికయందుఁబడి పొరలనారంభించెను. కొంతసేపటికి లేచి జనులను జూచి మీరందరు నసత్యవాదులుగానున్నారు. ఇదియజ్ఞశాలకాదని నిందింపనారంభించెను. అదివిని ప్రజలు ,,ఏమి? ఇదియజ్ఞశాలకాదా? ఈ యజ్ఞమువలన నెందరుదరిద్రులు భాగ్యవంతులయిరో యెఱుగుదువా? ఇదివఱకుఁజరిగిన యజ్ఞములన్నింటిలో నిదియుత్తమమయినది. ఇట్టియజ్ఞమెన్నఁడును జరిగియుండలేదు'' అనిరి అంతటనాయుడుత ,,ఒకపల్లెటూరులో నొకపేదబ్రాహ్మణుఁడు భార్యతోడను కొడుకుకోడలుతోడను గాపురముచేయుచుండెను. వారునిరుపేదలు. వారిధర్మోపదేశములువిని యెవ్వరైన నొకతృణమిచ్చినదానితో పొట్టబోసికొనుచుండెడివారు. అంతటమూడు సంవత్సరములు కరువువచ్చెను. దానివలన నాపేదపాఱునకు సంకటమెక్కువయయ్యెను. కొన్నిదినములు పస్తుపడినతరువాతనొకనాడు తిరిగిఁతిరిగి యావిప్రుఁడు కొంచెముపరిపిండి నెట్లోప్రయాసపడితెచ్చి దానినికుటుంబము నలుగురికి నాలుగు భాగములుగా విభజించెను. వానిని జావగాచుకొని తినసిద్ధముగానుండగా నెవరో తలుపుకొట్టిరి. విప్రుఁడు తలుపుతీసిచూచిన నతిథియొకఁడువచ్చియుండెను. అతిథిభగవత్స్వరూపుఁడనియు వానినిభగవంతునివలె నారాధింపవలెననియు హిందూదేశపుమర్యాదగనుక యాపేదబాపఁడా యతిథింగని ,,అయ్యా లోపలికి దయచేయుఁడని యాదరణపూర్వకముగ లోనికిఁగొనివచ్చి తనవంతునకువచ్చినజావను వానికి సమర్పించెను. అతఁడు దానినాత్రముతో నిమిషములోఁదిని ,,యయ్యా నన్నుచంపివేసినారు నాకు పదిదినములనుండి తిండిలేదు. మీరిచ్చిన యీస్వల్పాహారమువలన నాకున్నయాక

లికూడ హెచ్చినది" యనెను. అదివినిభార్య "నావంతుకూడనిందు మన ముగృహస్థులముగనుక యతిథి సత్కారము మనకువిధి. మీభాగమిచ్చి వేసితిరి గావున మీకడలేనపుడు నాభాగమునిచ్చుట భార్యనగుటనాకు విధి" యనిచెప్పి యామెవంతువచ్చిన యాహారమునుగూడ వానికొసం గెను. అతిథికిఁదానితోఁగూడ నాకలితీరలేదు. అంతటకుమారుఁడు "అ య్యా ధర్మాచరణమునఁ దండ్రికి తనయుఁడుతోడుపడుటావశ్యకము గావున నావంతుభోజనముగూడ నతిథికిబెట్టుడు" అనితనయాహారము నిచ్చివేసెను కానియతిధికి దానివలనఁగూడ తృప్తి కలుగలేదు. కోడలు కూడ తనవంతునిచ్చివేసెను. అతిథి సంతుష్టుఁడై వారినిదీవించి చనియె ను. ఆరాత్రియాకుటుంబమువారు నలుగురును క్షుద్బాధచే మృతినొం దిరి. ఆపిండిలోనినాలుగురేణువులు నేలమీదబడియుండెను. అక్కడనేను బడి దొరలిననాశరీరమున సగమిట్లు బంగారమయ్యెను. అప్పటినుండి యట్టి యాగమెక్కడనైననమరలనగపడునేమోయని లోకములన్నియు దిరుగుచుంటిని. ఎక్కడకుదిరిగినను నాతక్కినసగము శరీరమును బంగా రమయినదికాదు. అందుచేతనిది యొకయజ్ఞముకాదని నేనంటినని" యు డుత చెప్పెను.

ఇట్టిధర్మబుద్ధి హిందూదేశమునఁ గ్రమముగా తొలగిపోవుచు న్నది. సత్పురుషులు రానురాను తక్కువగుచున్నారు. నేనుచిన్నతమున జదువుకొన్న యింగ్లీషుపుస్తకములో నొకబాలుఁడు దానుపాటుబడి ప నిచేసి తెచ్చిన ద్రవ్యములో కొంతభాగమును తల్లికిచ్చునని యొకకథ గలదు. ఆబాలకుని రెండుమూడుపుటలలోఁ బొగడియుంచిరి. ఏమది? దానియందలి నీతియేమో హిందూబాలకునికి బోధపడదు. ఎవరికివారే యను పాశ్చాత్యధర్మమును జూచినతరువాత దానికర్థము నాకిప్పుడు బోధపడినది. కొందరు తాముసంపాదించిన దంతయు తామేస్వీకరించి

తల్లిదండ్రులను ఆలుబిడ్డలును వారికర్మమని త్యజింతురు. గృహస్థున కట్టిబుద్ధి యెన్నడు నచ్చట నుండరాదు.

ఇప్పుడు కర్మయోగమన నేమో తెలిసికొంటిమి. దానిసిద్ధము గనున్నప్పుడైన ననుసరే. మాటలుమాటాడక పరోపకారము చేయుట కర్మయోగము. ఎన్నిసారులు మోసపోయిననుసరే. యేమియు పరీక్ష వేయక యేమిచేయుచున్నామనియైన చింతించక పరోపకారము చేయవలెను.

ఎన్నడును చేసినధర్మములను జెప్పుకొనరాదు. వారు మనకు కృతజ్ఞులయి యుండవలయుననియు గోరుకొనరాదు. ధర్మమాచరించ నవకాశమును గలిగించినందులకు మనమే వారిపై కృతజ్ఞత కలిగియుండవలెను. దీనినిబట్టిచూడగా యథావిధిగ సన్యాసియై యుండుటకంటె యథావిధియయిన గృహస్థుడై యుండుటే కష్టతరమని దెలియవచ్చుచున్నది. నిక్కమయిన వైరాగ్యము నవలంబించుటెంత కష్టమో నిక్కమయిన కర్మయోగము నవలంబించుటయు నంతేకష్టమే.



సంఘముయొక్క యాదర్శములను ప్రవృత్తులను బట్టి మనకు గౌరవౌన్నత్యములు కలుగు కార్యములను జేయుచుండుట మనకు కర్తవ్యము. అయినను ప్రతిసంఘమునందును దేశమునందు నెల్లప్పుడు నొకేయాదర్శములును ప్రవృత్తులునుండవు. ఈవిషయము నెఱుంగకుండుటచేతనే దేశములొండొంటిపై యనవసరమైన ద్వేషభావమును గలిగి కలహించుచుండుటకు కారణము. తన దేశాచారప్రకారము తానాచరించినదే యుత్తమధర్మమనియుఁ దక్కినవారలు చేయునవి పాపకార్యములనియు నమెరికాదేశస్థుఁడు తలంచును. తనయాచారములు మాత్రమే సదాచారములనియు వానినాచరించనివారందరు పాపాత్ములనియు హిందువనుకొనును. ఇది సర్వసాధారణముగా మనకండఱకును సహజమైన వట్టిపొరబాటే కాని దీనివలన నెక్కువహాని వాటిల్లుచున్నది. లోకములోని సగము ద్వేషమునకిదియే మూలము. నేనీదేశమునకువచ్చి చికాగో బజారునఁదిరుగుచుండగా నొకడు వెనుకనుండివచ్చి నాపాగాను లాగెను. వెనుకకుఁ దిరిగిచూడగా నాతని వేషమునుబట్టి పెద్దమనుష్యునివలెనే యగుపడెను. నేను వానితో మాటలాడితిని. నాకింగ్లీషు వచ్చునని తెలిసికొనినతోడనే యాతఁడు మిక్కిలి సిగ్గుపడిపోయెను. ఇంకొకమారాబజారులోనే యింకొకడు నన్ను ముందుకు గెంటెను. నేను వానినట్లు చేయుటకుఁ గారణమేమని యడుగగా నాతఁడును సిగ్గుపడి "అట్టివేషము వేసికొంటివేమని' క్షమాపణ పూర్వకముగా మెల్లగా నడిగెను. తమభాష నేర్చిన వారియెడలను వారివలె యుడుపులు ధరించిన వారియెడలను మాత్రమే వారికభిమానము కలదు. ఇతరులపైని ద్వేషము. ఇందుచేతనే బలముయిన దేశములు నీరసదేశములపైఁబడి హస్తగింప జూచుట ఈదురభిప్రాయముండుట తోడనే తోడిమానవుల ప[illegible]సిన సహోభ్రాతృత్వ ధర్మము నశించుచున్నది. తనవలెఁ బట్టకట్టుకొనలేదని నన్ను బాధింపనెంచిన యాతఁడుత్తముఁడైన పౌరుడేమై

యుండవచ్చును. కాని తనకు భిన్నముగా వస్త్రములను గట్టుకొనిన వానిఁ జూడగానే వానిమనసుననున్న దయారస మింకిపోయినది. ఇట్లే విదేశీయులెక్కడికిఁ బోయినను బాధింపబడుదురు. ఆకారణముచేత వారికా దేశస్థులయెడల నన్నియెుందుర భిప్రాయములే బలపడును. నావికులు సైనికులు వర్తకులు మున్నగువారు విదేశములకుఁబోయి పలుపోకలపోవుదురు. వారి స్వదేశమున నట్టికల్లైనవర్తించి యెఱుంగరు. చీనాదేశస్థులు యూరోపియనులను అమెరికనులను విలాతి దయ్యములని పిలుచుటకిదియే కారణమై యుండవచ్చును. పాశ్చాత్త్యులమే విభాగమును వారు జూచియుండినయెడల వారట్లనఁజాలరు.

గావున మనము జ్ఞాపకముంచుకొనవలసిన యంశమొకటియు. నేదియన నితరుల ధర్మము నెప్పుడును మనము వారిసందర్భమున బరిశీలింప ప్రియత్నింపవలెనుగాని మన స్థితులనుబట్టి విచారింపగూడదనుటయే. ప్రపంచమున కంతకుడును నేనొక్కడనే ప్రతినిధినిగాను. ప్రపంచమునకు నాయాచారములను నేనుసరిపెట్టుకొనవలెను గాని నాయాచారములకు సరిగ ప్రపంచము నడువవలెననరాదు. గనుక స్థితిగతులనుబట్టి ధర్మములు స్వభావములు మారుచుండుట మనము చూచుచున్నాము. దీనివలన నేకాలమునకుఁ దగిన ధర్మము నాకాలమున నెరవేర్చుటయే మనము జేయగలిగినట్టి శ్రేష్ఠకార్యమైయున్నది. జన్మముచే మనకు నియమితమైన ధర్మమును మనము మొదట జేయుదుము. అటుపిమ్మట సంఘమువలనను జీవితమువలనను మనకు గల్గుస్థానమునుబట్టి గలిగెడు ధర్మమును మనము నెరవేర్పవచ్చును. అయినను మనుష్యస్వభావమున నొక్కగొప్ప యుపద్రవముగలదు. అదియేదియనిన మనుజుఁడు తన్నుఁదానెప్పుడును బరిశీలించుకొనకుండుటయే. అతఁడుతానుగూడ రాజువలెనే సింహాసనారూఢుడనగుటకుఁ దగినవాడననియే యోచించుచుండును.

అతఁడొకవేళ నట్లగుపడ్డైనను మొదట తనకిప్పటికి విధియైన ధర్మము ను తానిపుడు నెరవేర్చి చూపవలెను. తరువాత నంతకన్న యోగ్యముల గు ధర్మము లాతనికి వచ్చును. ప్రపంచమున మనము పూనికతోఁ బనిఁజేయ ప్రారంభించితిమేని, నదృష్టదేవత మనకన్నివైపులను వికల్పముల గలుగఁజేసి మన స్థానమును మనము శీఘ్రముగ దెలిసికొను నట్లు చేయుచున్నది. ఏమనుజుఁడుగాని ప్రపంచమున దానాక్రమించుట కర్హత లేని పదవిని దాను జాలకాలమువరకు నాక్రమించియుండ నేరడు. ప్రకృతికి ప్రతికూలముగా దలంచుటయందు లాభము లేదు. గనుక త క్కువ కృత్యమును జేయువాఁడు తక్కువవాఁడుగాడు. తానాచరించు ధర్మముల స్వభావమునుబట్టియే, యెవ్వడును బరీక్షింప బడకూడదు. మనుజులందరునుగూడ వారుతమ ధర్మములనే స్వభావముతో నాచరిం చుచుంటిరో దానినిబట్టియే బరిశీలింపవలెను.

మనమిదివరకు ధర్మమునుగురించి చెప్పిన యీయభిప్రాయము గూడ మార్పును బొందుననియు నిష్కల్మవృత్తితోను ప్రతిఫలాపేక్ష లేకుండను మనము కార్యావలంబనము జేసినపుడుమాత్రమే యు త్కృష్టకృత్యమును నెరవేర్పనగుననియు ముందుముందు మనము కను గొందుము. ఐనను ధర్మమను జ్ఞానముతో చేసెడు పనిమూలముననే క్రమముగా నట్టియుద్దేశమేమియు లేకుండ నిష్కామ్యముగా కర్మచే యుటకు మనలను నడిపించును. ఎప్పుడు కర్మ భగవదారాధనముగాను అంతకంటె నెక్కువదిగాను నగునో యపుడు కేవలకర్మార్థమే కర్మగా వింప బడినదగును. తక్కిన యోగములలోవలెనే కర్మయోగమునకు గూడ ప్రయోజనము, పరమాత్మను ప్రకాశింపజేయుటయే ఐహికప్ర వృత్తులను తగ్గించి పరమార్థప్రవృత్తులను గలిగించుటయే. ఇది విషయ వాంఛలను త్యజించుటవలనఁ గలుగుచున్నది. దీనినే ధర్మము శాసించును.

ఇట్లే సాంఘిక తత్వమంతయు నందఱకుఁ దెలిసినను దెలియకున్నను నీప్రకారముగానే కర్మానుభవములనుబట్టి యేర్పడినది. స్వార్థపరాయణతను గుఱించుట వలన నాత్మాభివృద్ధికి మార్గమేర్పడినది. ధర్మమెప్పుడును తీయగానుండదు. దీనితో ప్రేమ సమ్మిళితమయినప్పుడే యది కొంతమృదువుగానడచును. లేనియెడల నెప్పుడును ఘర్షణమే తటస్థించును. అదిలేనియెడల తల్లిదండ్రుల బిడ్డలకును, భర్తలు భార్యలకును వారువారికిని దమతమ విధులను నెరవేర్పజాలక పోవుదురు. ప్రతిదినమును మనమెన్నియో కలహములను జూచుచున్నాము. ప్రేమ యుండినప్పుడే ధర్మము రుచిగావుండును. ప్రేమ స్వేచ్ఛయందుగాని ప్రకాశింపదు. మనజన్మమున మనకుఁదటస్థించు రాగ ద్వేషాది తుచ్ఛవిషయముల కన్నింటికిని దాసులమగుట స్వేచ్ఛయగునా? వీనికన్నింటికి నోర్చి యుండుటయే స్వేచ్ఛ. తమ కోపస్వభావమునకు బానిసలయి మగల నిందించు భార్యలు స్వతంత్రలమని వారనుకొనినను అట్లు చేయుటవలననే వారు బానిసలని రుజువగుచున్నది. ఇట్లే భార్యల నిందించుభర్తలును బానిసలగుచున్నారు.

స్త్రీకి గాని పురుషునికి గాని పాతివ్రత్యము ప్రథమధర్మము. ఎంత చెడి తిరిగినవాఁడయినను ప్రేమాస్పదురాలయి పతివ్రతయయిన భార్యయొక్క సద్బోధనలవలన మంచిమార్గమునకు రానివాఁడుండడు. లోకమింకను అంతవరకుఁ జెడలేదు. పశుప్రాయులయిన భర్తలను గురించియు పురుషుల దుర్నీతిని గురించియు మనము తరుచు వినుచుందుము గాని యంతటి పశుప్రాయులయిన భార్యలును దుర్నీతిగల స్త్రీలనుమాత్రములేరా? స్త్రీలందరు తాము చెప్పుకొనునట్లు పావనులును సద్వర్తనముగలవారునయి యుండినయెడల లోకమున దుర్నీతిగల పురుషుఁడొక్కఁడయిన నుండడని నాయభిప్రాయము. పాతివ్రత్యము పారిశుధ్యమునను వీనికి లొంగని పశుత్వముండునా? సాధ్వియై తనవిభుని దక్క తక్కిన

పురుషులనందరిని బిడ్డలనుగాఁజూచుకొను స్త్రీ రత్నము నుజూచిన తోడనే యెంతటి తులువయైనను మాతృభావముతో పాదాక్రాంతుఁడుగాక యుండునా? అట్లే ప్రతి పురుషుఁడును పరస్త్రీలనందరిని తల్లులనుగాను, దుహితలును గాను సోదరులనుగాను జూచుకొనవలెను. మరియును మతగురువుగానుండఁగోరువాఁడు ప్రతిస్త్రీని తనతల్లినివలెఁజూచుకొని యామెయందట్టి వృత్తితో మెలగవలెను.

లోకములోని కెల్ల మాతృస్థానముసర్వోత్కృష్టమయినది. స్వార్థత్యాగమును నేర్చుకొనుటకును అభ్యసించుటకును నదియే. ముఖ్యమయిన తావు మాతృప్రేమకంటె ఘనతరమయిన దొక్కఁడై వభక్తిమాత్రమే. తక్కినవన్నియు దానికి లొక్కువ. తనబిడ్డలసదుపాయముఁ జూచుకొనుట తల్లికిలక్షణము. అట్లుకాక తల్లిదండ్రులు దమసంగతియె మొదట చూచుకొనువారయిన యెడల తల్లిదండ్రులకును, బిడ్డలకు నుండుసంబందము లెక్కలు వచ్చినతోడనే తల్లిదండ్రులనెఱుఁగకుండ బోవు పశుపక్ష్యాదుల యను బంధమువంటిదే యగును. స్త్రీని భగవంతుని మాతృ ధర్మముగాఁ జూడ గలిగిన మనుష్యుఁడెంతయుధన్యుఁడు. పురుషుని భగవంతుని పితృధర్మము గాజూడగలిగిన స్త్రీధన్యురాలు.తల్లిదండ్రులను ప్రత్యక్షదైవములుగా జూచుకొను బిడ్డలుధన్యులు.

మన కవ్యవహితమయిన ధర్మము నాచరించి దానివలన నంతకంటె ఘనతరమయినదాని నాచరించుచు గ్రమక్రమముగా సర్వోత్కృష్టమయిన పరమ ధర్మమును సాధించు శక్తిని గలిగించుకొనుటయే మనము వృద్ధిజెందుటకు మార్గము. పడుచువాఁడగు సన్న్యాసి యొకఁడొక యరణ్యములోనికేగి యక్కడచిరకాలము తపస్సుచేసి నిష్ఠుఁడై యొక్కనాడొక చెట్టునీడను గూర్చుండియుండఁ దనమీదగొన్ని యెండిపోయిన యాకులు రాలిపడెను. అంతట పైకిఁజూచిన నొక కొంగదాని

మీఁద నగపడెను. తోడనే యాతని కాగ్రహముపొడమి,, ఏమి? నామీఁద నాకులు పడవేయునంతటి పొగరబోతు తనమా. నీకని" తీవ్రదృష్టితో జూచిన యా యోగి యొక్క ప్రభావమునకాబకము భస్మమయిపోయెను. అదిచూచి యాముని కుమారుఁడు దృష్టిమాత్రము చేతనే కొంగను సంహరింపఁగలిగిన తనప్రభావమునకు సంతుష్టుఁడైయుండెను. ఇట్లుండ కొన్నాళ్ళకు భిక్షుకై పురమునకుఁ బోవలసివచ్చెను. పోయి యొక యింటికేగి ,,అమ్మా" బిక్షముపెట్టుమని పిలిచెను. ,,నాయనా కొంచము తాళుమని" లోపలనుండి ప్రతివచనము వచ్చెను. దానికాతఁడు గినిసి ,, ఓసిపాపిష్ఠీనన్ను వేచియుండమనెదవా? నాప్రభావమెఱుఁగవు కాబోలు" నని యనుకొనెను. ఇట్లు తనలో ననుకొనుచుండగా మరల లోపలనుండి,,అబ్బాయీ? మిగులగొప్పవాఁడనని యుప్పొంగఁబోకుము. ఇక్కడ కొంగలును కాకులును లేవు సుమీయని మరల నొక శబ్దమువినవచ్చెను. ఆమాటలు విని యాశ్చర్యపడి వేచియుండెను. కొంతసేపటికి లోపలనుండి గృహిణి వచ్చినని యోగి యామెపాదములపైవ్రాలి ,,అమ్మా అది నీకెట్లు తెలిసినద "ని యడిగెను. ఆమె,, కుమారా? నాకు యోగములు యోగాభ్యాసములును దెలియవు. నేను నందరివంటిసామాన్యస్త్రీనే నాభర్త యస్వస్థుఁడై యున్నాడు. అందుల కుపచారముచేయుచున్న దానవగుట నిన్నాపవలసివచ్చినది. నాయావజ్జీవమును నావిధులను నెఱవేర్పుటకయి పాటుపడుచుందును. నాకు వివాహమగువఱకును, తల్లిదండ్రులకు సేవజేసినాను. వివాహమయినది మొదలు పతిపూజ జేయుచున్నాను. నేనభ్యసించెడు యోగమిదియే. ఇట్లు నాధర్మమును నేనాచరించుట వలన నాకు జ్ఞానమువచ్చినది. దానింబట్టి నీయూహలను నీవరణ్యమునఁ జేసినపనినిఁ దెలిసికొన గలిగితిని. ఇంతకంటెను విశేషమును దెలియఁ గోరుదువేని యాపట్టణమున నంగడియందు ధర్మవ్యాధుం

డను నతఁడొకఁడుకలఁడు. వానికడకేగిన నీకతఁడు ధర్మోపదేశమును జేయునని చెప్పెను. ఆమాటలు విని సన్యాసి మనమా పట్టణమునకు ధర్మవ్యాధుని కడకేలపోవలెనని యనుకొనెను గాని యామె దర్శనమునఁ గొంతమనోవికాసముకలిగి యాప్రకారమక్కడకుఁబోయెను. పట్టణసమీపమునకు రాగానే బజారు గనిపించెను. అక్కడ నొక వ్యాధుఁడు మాంసమును ఖండించుచుఁ గొనవచ్చినవారికమ్ముచుఁ బేరమాడుచుఁ గాన వచ్చెను. వానింజూచి యామునికుమారుఁడు "దైవమా? వీనికడ నాసేను ధర్మోపదేశమును గొనుట. వీఁడుపరమపాతకుఁడు గానున్నాఁడు అని తలపోయుచుండెను. అంతట నావ్యాధుఁడు వీనింజూచి "స్వామీ మిమ్ముల నాసాధ్వీమణియా పంపినది? నాపని తీరినతోడనే వచ్చెదను దయచేసి యాసీనులయి యుండుడని" చెప్పెను. సన్యాసి యేమితటస్థించునోయని చింతించి యాసీనుండైనఁగొంతసేపటి కాకిరాతుఁడు తనపని చాలించి వచ్చిన ద్రవ్యమును బట్టికొని లేచివచ్చి "స్వామీనాతోడ మాయింటికిఁ దయచేయుఁడని మునికుమారునింటికిఁగొనిపోయి కూర్చుండఁబెట్టి యించుక దాళుమని చెప్పి లోనికిఁ బోయి తల్లిదండ్రులను స్నానముచేయించి భోజనముపెట్టి వారికియుపచారములన్నియుఁ జేసి పిమ్మట వచ్చి సన్యాసితో "అయ్యా! మీరిచ్చటికి నన్నుఁజూడవచ్చినారు. నావలనమీకుగావలసినదేమనియడిగెను. సన్యాసి ఆత్మను గురించియుఁ దేవునిగురించియుఁ గొన్నిప్రశ్నలడిగిన వానికిఁ బ్రత్యుత్తరముగా నాతఁడొక యుపన్యాసము చేసెను. అది మహాభారతము నందు వ్యాధ గీతలను పేరఁబరగుచున్నది. అందు మహత్తర మయిన వేదాంత ధర్మములు గలవు. ఆవ్యాధుని యుపన్యాసమును జూచి మునికుమారుఁడాశ్చర్య నిమగ్నుఁడయి "యింతజ్ఞానివై యుండి నీవీశరీరమునముండి యిట్టి నికృష్ట వృత్తియం దేలయుంటివ"ని యడిగెను. అందుల కాతఁడు "కుమారా? ధర్మ

మెద్దియు నికృష్టము కాదు-నాజన్మమును బట్టి నాకిట్టి వృత్తి యేర్పడినది. నాచిన్నతనమున నేనీవ్యాపారమును నేర్చుకొంటిని. నాకుఁదీనియందు సంగము లేదు.నిర్లిప్తుఁడనై నాధర్మమును నేను చేయుచున్నాను. నాగార్హస్థ్య ధర్మమును యథావిధి నాచరించెదను. నాతల్లిదండ్రులను సుఖపెట్టుటకు నాశక్తి కొలఁదిఁ బ్రయత్నించుదును. నాకు నీయోగమును దెలియదు. నేను సన్యాసిని గాలేను అరణ్యములకును బోలేదు. అయినప్పటికిని నీవు చూచిన నాజ్ఞానమంతయు నిర్లిప్తుఁడనై నాకు విధింపఁబడిన ధర్మమాచరించుటచేతనే కలిగినది అని చెప్పెను.

హిందూదేశమున నొక జ్ఞానికలఁడు. ఆతఁడత్యద్భుతమయిన మనుష్యుఁడు. అట్టివాని నేనెక్కడను జూడలేదు. అంతటలోకవిరుద్ధమయిన పురుషుఁడు ఎవరికి నేమియు బోధచేయఁడు ఎవరయిన ప్రశ్నించిన యెడల సమాధానము చెప్పఁడు.గురువుగానుండుటకు దనకర్హతలేదనియెంచి యాతఁడట్లు చెప్పుట కంగీకరింపఁడు. నీవొక ప్రశ్ననడిగి కొన్ని దినములు వేచి యుంటివేని యాతఁడు ప్రసంగవశమున నావిషయమును దీసికొనివచ్చి యద్భుతముగాఁ దానిని బోధించును. అతఁడు నాకొకప్పుడు కర్మరహస్యము నిట్లు బోధించెను. "కార్యకారణములు రెండు నొకటిగావలెను" నీవుపనిచేయునపుడింక దేనిని జింతింపకుము.అదియొకయారాధనముగానెంచి తదేకనిష్ఠతో నీమనస్సంతయు దాని యందైక్యమునొందింపుము. పైగాథయందీ ప్రకారముగా వ్యాధుఁడును సాధ్వియుఁ దమతమ ధర్మములను హృదయ పూర్వకముగను సంతోషముతోడను ఆచరించిరి. అందుచే వారికి జ్ఞానోదయమయినది. దీనిని బట్టి తమ యాశ్రమమునకు విధింపఁబడిన ధర్మములను ఫలవిరాగులై యాచరించుటవలన పరమాత్మజ్ఞానము కుదురునని స్పష్టముగా తెలియుచున్నది. ఫలమునందు బద్ధానురాగుఁడై యున్నకర్మకుఁడు మాత్రమే తనకు విధింపఁబడిన ధ

ర్మములుఁ మంచివిగావని విచారమును పొందును గాని నిర్లిప్తుఁడైనవా నికన్ని ధర్మములును మంచివే. వానిమూలముననే వాఁడు స్వార్థపరత్వ మును జరపుకొని ముక్తిసంపాదించుకొనును. మనమందరమును చాల గొప్పవారలమని యనుకొనుచుందుము. ఒకరికంటె మనకెక్కువధర్మ ములు గావలయునని వాంఛించుచుందుము. ఇట్టిస్పర్థమూలమున నసూ య బయలు దేరును. అదిహృదయమందున్న దయను జంపును. మూలి గెను వానికేధర్మమును రుచింపదు. వానికిఁ దేనివలననుఁ దృప్తిగలుగదు. వానిజన్మ మెన్నటికిని వ్యర్థమే. మనకేది ధర్మమగునో దానినెల్ల నిశ్చింతతో పూనిక పడి చేయవలెను. అప్పుడు మనకు నిశ్చయముగా జ్ఞానము కలుగును.





# కర్మయోగము

## ఐదవ ప్రకరణము.

## లోకోపకారము స్వోపకారము

## (We help ourselves not the World)



ధర్మరతి మన యాత్మాభివృద్ధి కెట్లు సహకారిగా నున్నదో విచారింపక ముందు, హిందూదేశమున కర్మకు మేము జెప్పెడు మఱియొకయర్థమును మీకు జెప్పెదను. ప్రతిమతమునందును, వేదాంతమనియు, పురాణగాథయనియు, కర్మకాండయనియు, మూడుభాగములుగలవు. ఈ మూటియందును వేదాంతము ప్రతిమతమునకును సారమైయున్నది. దీనినే పురాణములు పూర్వకాలపు మహనీయుల జీవనములచేతను, గథలచేతను, ననేకములగు కల్పిత గాథలు మొదలుగాగల వాటిచేతను నుదహరించి మనకుబోధచేయుచున్నవి. కర్మభాగము దీనినేసర్వజనులకును గ్రాహ్యమగునట్లు మఱికొంత విపులముగాను, సులభసాధ్యముగాను జేయుచున్నది. కర్మనిశ్చయముగా వేదాంతమందలి సూక్ష్మాభిప్రాయములకు స్థూలరూపమును గలిగించుచున్నది. ఇదియే కర్మయనబడుచున్నది. మనలో జాలమంది యాత్మజ్ఞానమును సంపాదించువఱకును, కేవలవేదాంతమును గ్రహించుట కశక్తులుగానున్నారు గాన, నీకర్మయనునది ప్రతిమతమునందును నత్యావశ్యకమై యున్నది. ప్రతివిషయమును గూడ మేము దెలిసికొనగలమని తలంచుట సులభమేగాని, యనుభవము

లోనికివచ్చినపుడు మాత్రము కేవల వేదాంత రహస్యములను స్పష్టముగా బోధపరచుకొనుట జాలకష్టసాధ్యము గావున వాటినిఁదెలియజేయుటకుఁ గుఱుతులుగొన్ని మనకావశ్యకము లైయున్నవి. ఈగుఱుతుల వలన సులభసాధ్యము గాని విషయములచక్కఁగాఁగ్రహించెడు పద్ధతిని మనము త్రోసివేయఁగూడదు. పురాతన కాలమునుండియును గూడ గుఱుతులు ప్రతిమతములవారిచేతను నుపయోగించబడుచునే యున్నవి. ఒక విధమును బట్టి చూడఁగుఱుతులమూలముననేగాని మనము దేనిని తలంపఁజాలము. మాటలు గూడ మనకు బుట్టెడు నూహలయొక్క గుఱుతులై యున్నవి. మఱియొక విధము చే నాలోచించిన ప్రపంచమున నున్న ప్రతివస్తువును గూడ నేదోయొక దానికిఁగుఱుతుగా నెంచవచ్చును. ఇంతయేల. ప్రపంచమేయొక గుఱుతు. అగోచరుఁడై వెనుకనున్న భగవంతుడె దీనిసారము. ఈగుఱుతులపద్ధతి మనుజుడు సృష్టించినదికాదు. ఏదోయొకమతమువారు గొందరేకీభవించి, కొన్నిగుఱుతుల నాలోచించి, వాటినితమ మనంబులనుండి వెలువరించి యనుభవములోనికిఁ దెచ్చినంత మాత్రముననే నీగుఱుతులువచ్చియుండలేదు. మతవిషయమగుగుర్తులు స్వతస్సిద్ధమగు వృద్ధిగలవియే. లేనియెడల, సర్వసామాన్యముగా ప్రతివానిమనసునందును గొన్నిగుఱుతులొకేవిధమగు నూహలనే యేలపుట్టింపవలెను? కొన్నిగుఱుతులు ప్రపంచమునందంతటను వ్యాప్తము జెందియున్నవి. మీలోచాలాభాగము చిలువయను గుఱుతు (Cross) క్రైస్తవమతమును దెలియఁజేయు సంబంధముననే మొట్టమొదటవచ్చెనని యూహింతురు, కాని యదార్థముగా నీగుఱుతు క్రైస్తవమతమునకు పూర్వముననును, మోసెస్ పుట్టకమునుపును, వేదములుద్భవింపకమునుపును,మరియుమనుజ సంతతినిగూర్చి యెవ్వనిచేగాని యేదియునువ్రాయఁబడని కాలమునఁగూడ నిదియుండియేయున్నది. ఈగుఱుతు యీజిప్షుల

కాలముననుఁ ఫోయినీషియనులకాలముననుగూడ నుండినట్లు గానఁబడు చున్నది. వారిలో ప్రతిజాతివారునుగూడ దీనిని గలిగియే యుండిరి. మరియు చిలువమీఁద కొరతవేయబడినవానిగుఱుతు సామాన్యముగా ప్రతిసంఘమువారికిని గూడఁ దెలిసియుండినట్లు గానఁబడుచున్నది. సున్న యనునది ప్రపంచమునందంతటనుగూడ ముఖ్యమగు గుఱుతుగానున్నది. తరువాత నన్నిటికన్నను మిక్కిలియెక్కువగా వ్యాపించియున్న స్వస్తిక 卐 యనుగుఱుతొకటిగలదు. ఒకప్పుడు బౌద్ధులు దీనినితమతోఁగూడ ప్రపంచమంతటను ద్రిప్పినట్లు తలంచఁబడెనుగాని బౌద్ధమతమునకు పూర్వమనేక శతాబ్దములక్రిందట దీనిననేకసంఘములవారు వాడినట్లు గానఁబడుచున్నది. పూర్వముబాబిలోనులోను ఈజిప్టులోనునుగూడ నిదికనుగొనబడెను. దీనివలన నేమి తేలుచున్నది. ఈగుఱుతులన్నియును పలువుర యేకీభావముమాత్రముననే వచ్చియుండనేరవు. వీనికన్నిటికిని నేదో యొకకారణముండితీరవలెను. దానికిని సరునిమనమునకు కొంతస్వభావసిద్ధమగు బాంధవ్యముండితీరవలెను. భాషయునుగూడ నిట్లేపలువుర యేకీభావమునఁగల్గినదిగాదు. మానవులందరునుగలసి యీయూహల నీమాటలచేత దెలియఁజేయుదమని యొప్పుకొనుటవలనఁగాదు. తనను దెలుపు మాటలేనిది యూహయెప్పుడును నుండనేరదు. అట్లే యూహలేనిది మాటయెన్నడు నుండఁజాలదు. గావున మాటయు నూహయు నవినాభావసంబంధముగలిగియున్నవి. ఒకదానినుండియొకదానివేరు జేయుటకలవిగాదు. ఊహలనుదెలుపు గుఱుతులు ధ్వనిరూపముననైన వర్ణరూపముననైన యుండవచ్చును. పుట్టుమూగవారికి నాదచిహ్నములు పనికిరావు. మనస్సునబుట్టు ప్రతియూహకును నొకరూపముండును. దీనిని సంస్కృతశాస్త్రములలో నామరూపమందురు. భాషనుసృష్టించుటెంత దుష్కరమో యట్లేగుర్తులను సృష్టించుటయుఁగూడ నసంభవమే. లోకము

నందలి కర్మరూపమయిన చిహ్నములవలన మానవకోటియొక్క మతాభిప్రాయములు దెలియవచ్చుచున్నవి. కర్మలు, ఆలయములు మొదలగు పరికరమంతయు ననవసరమని చెప్పుట చాలసుకరమే. ఈరోజులలో నామాటలు ప్రతిపిల్లవాఁడును చెప్పుచున్నాఁడు కాని యాలయముల లోనికిఁబోయియారాధించువారికిని అట్లుచేయకుండువారికిని గలభేదమందరికిని స్పష్టముగాఁ దెలియుచునేయుండును. కాబట్టి కొన్నికొన్ని యాలయములు, కర్మలు మొదలగు స్థూలరూపములవలన కొన్నికొన్ని మతములవారి కాయాచిహ్నము లేయభిప్రాయములను దెలుపుట కేర్పడిన వో ఆయభిప్రాయములు వారిమనస్సులకు నాటునుకాఁబట్టి కర్మలను విగ్రహములను కేవలము నిరసించుట వివేకమయినపనికాదు. వీనినిగూర్చినవిమర్శయును అభ్యాసమునుగూడ సహజముగ కర్మయోగమున కొకభాగముగా నేర్పడుచున్నది.

ఈకర్మశాస్త్రమింకను పలుముఖములుగనున్నది. అందొకటి మనస్సునకును, వాక్కునకును గలసంబంధమును, వాక్శక్తివలన నేమిచేయగలమో దానిని, దెలిసికొనుట ప్రతిమతమువారును వాక్శక్తినంగీకరించియున్నారు. అంతేగాక సృష్టియంతయు శబ్దమువలనఁ గలిగినదని కూడ కొందరిమతము. భగవదుద్దేశమునకు బహిర్ముఖము, శబ్దము. భగవంతుఁడు సృష్టినిజేయుటకుముందు మనస్సున సంకల్పముచేసినందున శబ్దమువలన లోకముసృజింపఁబడినది. ఈజడప్రపంచముయొక్క తాపత్రయమునఁజిక్కి మనబుద్ధి మందగించిపోవును. వయస్సువచ్చినకొలదిని లోకముతోడ ననుబంధముహెచ్చి మఱింతజడులమగుచున్నాము. అందుచేతనను క్షణమువిడువక మనకన్నులయెదుట జరుగువిషయములను గూడ మనముగనలేకున్నాము. అయినప్పటికిని మధ్యమధ్య మానవస్వభావముప్రబలి వానితత్త్వమునుగూర్చి యొక్కొక్కపుడు చర్చసేయ

మనసుపుట్టుచుండును. అట్టిబుద్ధిపుట్టుటయు నదియద్భుతముగాఁగనబడుటయు జ్ఞానోదయమగుటకు ప్రథమసోపానము. శబ్దమునకు వేదాంతశాస్త్రమునందుగల ప్రాముఖ్యతయు ప్రభావమును అట్లుంచినను జగన్నాటకమున శబ్దములత్యంతప్రధానమయిన పనులను జేయుచున్నవి. నేను నీతో మాటలాడుచున్నాను నిన్ను దాకుటలేదు. అయినప్పటికిని నామాటలువలన వాయువుంగో తరంగములుబయలుదేరి యవినీశ్రోత్రపుటంబులం బ్రవేశించి నీజ్ఞానతంతువులను స్పృశించి నీమనస్సున వికారములను బుట్టించుచున్నవి. దీనినడ్డగింపలేము. ఇంతకంటెవింత యేమయినఁగలదా? ఒకఁడు నిన్ను మూర్ఖుఁడాయని పిలిచిన నీవుంగోడనే లేచి యొకగుద్దు వేయుదువు. చూచినారా శబ్దముయొక్క శక్తి? ఒకస్త్రీ యేడ్చుచుండును. ఇంకొకతె వచ్చి శాంతవచనంబుల దుఃఖోపశమనము చేయును. వెంటనే యామె దుఃఖమంతయును బోయి నవ్వుటకారంభించును. శబ్దశక్తి యెట్టిదో చింతింపుఁడు! వేదాంతశాస్త్రమునందును సామాన్యలోకవర్తనమునందునుగూడ నవియొకమహత్తరమయిన శక్తియైయున్నవి. మనము రేయింబవళ్లు సర్వదా యాశక్తిని వినియోగించుచున్నాము గాని వానివిమర్శ లేశమును జేయుటలేదు. ఈశక్తియొక్క స్వభావమును దెలిసికొని దానినిజక్కఁగ నుపయోగించువిధమును గ్రహించుటకూడ కర్మయోగమునందొక భాగమయియున్నది.

పరులయెడమన మనుసరింపవలసినధర్మము వారికి సహాయము జేయుటయే. ఇదియే ప్రపంచమున కుపకారము జేయుట. ప్రపంచమునకు మనముపకారమేల జేయవలెను? ప్రపంచమున కుపకారముఁ జేయుట దానికి సహకారమొనర్పఁగోరి చేసినట్లు గాన్పించినను నిశ్చయముగా నదియును మనయభివృద్ధికొఱకే. మనమెల్లపుడును ప్రపంచమునకు మేలుఁజేయ బ్రయత్నింపవలెను. అదియే మనకోరికయైయుండవలెను. కాని బాగుగా

విచారించిచూచినయెడల ప్రపంచము మనసహాయము నించుకయినను గోరుచున్నట్లుగానఁబడదు. ఈసృష్టియంతయునుగూడ నీవుగాని లేక నేనుగానివచ్చి దానియభివృద్ధింగోరి దానికి సహాయమొనర్పవలెనని సృజింపఁబడలేదు. నేనొకప్పుడొక ప్రార్థనపుస్తకమునుజదివితిని. దానిలో నిట్లువ్రాయబడియుండెను "చక్కని యీప్రపంచమంతయు నితరుల కుపకారముఁజేయుటకు మనకుజాలవీలునిచ్చుచున్నది గాన మిక్కిలిబాగుగానున్నది" పైకిమాత్రమిది చక్కనివాక్యమేగాని ప్రపంచమునకు మన సహాయమావశ్యకమనిచెప్పుట వెఱ్ఱితనముగాదా? దానిలోవిశేషమగు దుఃఖమున్నదనుట నిజము, గాన మనము పరోపకారముఁ జేయుట మన యుపకారమునకే యని ముందు మనము దెలిసికొని యప్పటికిని యిపుడితరులకు సహాయమొనర్చుట మిక్కిలి యుత్కృష్ట కార్యమే. నాబాల్యమందు నేను గొన్ని తెల్లచుంచుల నొక చిన్న పెట్టెలో బెట్టి పెంచుచుండెడివాడను. ఆపెట్టెకుఁ జిన్న చక్రములుగలవు. చుంచులాచక్రములదాటఁ బ్రయత్నించినపుడెల్ల చక్రములు తిరుగుటారంభించెను. చుంచులు మాత్రమెక్కడికిని బోవకుండెను. ప్రపంచమును దానికి మనము సహాయమొనర్చుటయునుగూడ నట్లేయున్నవి. జ్ఞానాభివృద్ధిని బొందుటయే యుపకారము. ప్రపంచము మంచిదియును, చెడ్డదియును గూడకాదు. ప్రతివాఁడును తనకు ప్రత్యేకముగ నొకప్రపంచమును జేసికొనుచున్నాడు. అంధుఁడొకఁడీప్రపంచమును గూర్చి విమర్శింప నెంచినయెడల నదిమెత్తనిదిగానో, లేక దృఢమైనదిగానో, శీతలముగానో, లేక వేడిగానో, గాన్పించును మనమెప్పుడును సుఖము పాలైగాని లేక దుఃఖముపాలైగాని యున్నాము. దీనిని మనమనేక వందల సారులు జూచుచునేయున్నాము. సహజముగ పడుచువారు గుణగ్రాహులుగాను వృద్ధులు పూర్వభాగులుగాను నుందురు. యౌవ్వనవంతు లేకముందుఁ జాల

కాలము జీవింపనున్నారు. జరాగ్రస్థులగువారు తమకాలమంతయుఁ బోయినదని మొఱలు పెట్టుదురు. నెరవేర్పనలవిగాని వాంఛలు వందలాది వారిమనంబునఁ గొట్టుకొనుచుండును. ఎట్లయినను చివరకిద్దఱునుగూడ బుద్ధిహీనులే. మనజీవితము దానినిగూర్చి మన మనంబున మనమాలోచించు విధమును బట్టి. పుణ్యముగానో, లేక పాపముగానో గాన్పించును. గాని ప్రత్యేకము నది రెండును గూడ కాదు. అట్లేయగ్నియును మనకది సహ్యముగా నుష్ణమిచ్చిన నపుడు దానిఁ గొనియాడుదుము. మనచేతిని గాల్చిన నపుడు దానిని నిందింతుము. దానిని ప్రత్యేకము విమర్శించినయెడల నది మంచిదియును జెడ్డదియును గూడఁ గాదు. మనము దానినుపయోగించు చందమును బట్టి మనకది సుఖకరముగానో, లేక దుఃఖకరముగానో గాన్పించును. ప్రపంచము గూడ నిట్టిదే. అది పూర్ణత్వము జెందియున్నది. పూర్ణత్వమునఁ దాని క్రియల కనుగుణముగా నుండునటుల జేయఁబడియున్నది. మనము లేనప్పటికిని గూడ నీప్రపంచవర్తన మెప్పటివలెఁ జక్కగాఁ బోవుచు నేయుండును. దాని వృద్ధినిగోరి దానికి మనము సహాకారమొనర్పవలెనని, వృథా ప్రయాసములఁ బొందనక్కర లేదు.

అయినను మనము పుణ్యకార్యములఁ జేయుచుండవలెను. మనజీవితకాలమంతయుఁ బరోపకారముఁ జేయుటకే యని మనము దెలిసికొనిన యెడల పుణ్యకార్యాచరణమునందాసక్తిఁ గలిగి యుండుట మనకోరికలన్నిటికంటె నత్యుత్కృష్టమైనది. ఎత్తయిన పీఠము నెక్కి యైదు వపెకములను జేతిలో నుంచికొని. ,,ఓ బీదవాడా! యిదిగో'' యని యెన్నడును జెప్పకుము. కాని యానిరుపేద నీవలన బిచ్చమునుగొని నీకు పుణ్యము గలిగించుటకై యచట నున్నాడని యెంచి వానికి కృతజ్ఞుడవుగమ్ము. లాభమును బొందువారు దానమును బట్టువాఁడు గాఁడు. దానమునిచ్చువాఁడే నీదయారసత్వమును పరోపకారత్వమును ఈప్రపంచమునఁ బ్రవహింపఁజే

నిన్ను నిర్మలుఁడవుగను, పాపరహితుఁడవుగను జేసికొనుటకు స్వతంత్రుఁడవైయుంటివని నందనము లొనర్పుము. పుణ్యకార్యములన్నియునుఁగూడ మనమలినమునుఁగొట్టివైచి సిద్ధినిచ్చుటకు సాధకములైయున్నవి. చివరకు మనము చేయఁగల సుగుణ కార్యములేవి? వైద్యశాలలు గట్టించుట, త్రోవలను చదునుచేసి రోడ్డులు వేయుట మొదలగునవిగద! మనమిట్టి ధర్మకార్యములఁ జేయుదుము. అందుకై యిరువది ముప్పది లక్షల డాలర్లు చందా చేయుదుము. పదిలక్షలు ఖర్చుచేసి ధర్మవైద్యశాల నొకదానిఁ గట్టుదుము. మఱిపదిలక్షలు వ్యయముచేసి విందుల నారగించి సారాయములఁద్రావి, తనియుదుము. మిగిలిన ద్రవ్యములో సగము భాగము ద్యోగస్థులపహరింతురు. తక్కినదిమాత్రము పేదల వినియోగమునకు రావచ్చును కాని యివియన్నియు నేమి? ఒక పెనుగాలి వీచినయెడల నీ మహామందిరములన్నియునుఁ గూడ నేలపాలు గావలసినవే? అప్పుడు మనమేమిచేయఁగలము? అగ్నిపర్వతమేదేని యొకటి భిన్నమయ్యెనేని మనధర్మశాలలు, నగరములు, మందిరములు, మొదలగున వన్నియునుఁ గూడ నాశనమై పోవును. ప్రపంచమునకుపకారము చేయుటనెడు పిచ్చిప్రసంగ మీపాటికి గట్టిపెట్టుదము. అదినీ సహాయమును గాని నా సహాయమును గాని యపేక్షించుటలేదు. మనమెప్పుడును గూడ నుపకారముఁ జేయుచునేయుండవలెను. అదియును స్వలాభమునకే. మనము సిద్ధిని బొందుటకదియే మార్గము. మనము సహాయమొనర్చిన పేదలలో నెవ్వఁడును మనకొక పైసయైన నీయవలసిన న్యాయములేదు. కాని సహాయము జేయుటకై మనకవకాశమిచ్చినందున వానికి మనమెంతయైన నీయవలసినదే. మనము ప్రపంచమునకు మేలుచేసితిమని గాని చేయఁగలమనిగాని లేక యీయా మనుజులకు సహాయమొనర్చితిమని తలంచుటగాని కేవలము నింద్యమైనపని. మన మొకనికి సహాయముఁ జేసితి మనియు, నందుచే వాఁడు

మనకు వందనము లొనర్పవలెననియు, వాఁడట్లు చేయునందునచే మనకు కష్టములు గలుగుచున్నవనియు తలంచెదము. మనము చేయుదాకిని ప్రతిఫలము మనమేల నపేక్షింపవలెను? నీసహాయమును బొందువాని యెడల కృతజ్ఞుఁడవై యుండి వానిని భగవంతుని గాఁదలంచుము. మనతోడి మానవుని సంరక్షించుటచే భగవంతునిఁ బూజించుటకు మనకు స్వాతంత్ర్యముగలుగుట గొప్పయదృష్టము. గాదా? మనకు నిజముగా పరస్పరానుబంధము లేనియడల నీవ్యర్థపుకోరికలవల్ల గలుగు ప్రయాస నంతను తప్పించుకొని. మనకార్యముల మనము సంతోషముతో చక్కఁగా నెరవేర్చుకొనగలిగి యుందుము. అనుబంధము లేక, పనిఁ జేసినయడల దుఃఖమును అసౌఖ్యమును, నెన్నడును గలుగనేరవు. ప్రపంచము తన సుఖ దుఃఖములతో నిల్లెప్పటికిని బోవుచునే యుండును. దర్వ్యాపేక్షగలిగిన బీదవాఁడొకఁడుండెను. వాఁడేదో విధమున నొకప్పుడు తనయాజ్ఞకు లోఁబడియుండు భూతము నొకదాని నెట్లయిన సంపాదించినయడల తనకు కావలసినవెల్ల దాని సహాయమునఁ బొందుచుండవచ్చునని వినెను. అప్పటినుండియు వాఁడొక భూతమును జేరఁదీయవలెనని చాల నాతురతతో నుండెను. భూతములనిచ్చు మహనీయుని కొరకై చాలకాలము దిరిగి తిరిగి చిట్టచివర కదృష్టవశమున మంత్రశాస్త్ర ప్రవీణుఁడగుఋషి పుంగవునొకనినిగని వాని నాశ్రయింప దొడగెను. నీవాభూతముతో నేమిచేయుదువని ఋషియడిగెను. అంతట వాఁడు „నాయాజ్ఞానువర్తియగు భూతము నొకదాని నేను సత్యావశ్యకముగ గోరుచున్నాను. నాకొక మంత్రముపదేశించి నామనోభీష్టమును నెరవేర్పు ”దని ప్రార్థించెను. కాని ఋషి కోపోద్రేకియై నన్ను చలింపజేయకుము పొమ్మని యానతీయ, నానాడింటికిఁబోయి మరునాడు మగుడవచ్చి వానిఁదీనుఁడై ప్రార్థింప దొడఁగెను. ఋషి విసుగుజెంది. „యీమంత్రమును దీసికొమ్ము. దానిని జపించితివేని నీవు చెప్పిన

ట్లు చేసెడు భూతమొకటి నిన్నాశ్రయించుకొని యుండును. కాని యవి క్రూర కర్మములను మాట మాత్రము మరువకుము. నీవుదానికెప్పుడును విరామము లేక పనిఁగల్పనఁ జేయవేని నీప్రాణములు దీయునని చెప్ప వాఁడు అది చాల సులభము. దీని జీవితకాలమంతకునుగూడ సరిపోవుపనిని నేను కల్పన జేయుదునని వెడలిపోయెను. తరువాత వాఁడొక యరణ్యమునకు బోయి యామంత్రోచ్చారణ మాచరింప కొంతసేపటికి భయంకరాకారమును. దీర్ఘకాయమును గల భూతమొకటి బయలువెడలి „నేనొక భూతమును; నీమంత్రమునకు వశమైతిని కాని నీవు నాకెప్పుడును తరుగులేకుండునట్లు పనినిచ్చుచుండవలెను. లేదేని నీప్రాణములు నీకుఁదక్కవని" చెప్పెను అంతటాపేద దానికొక మేడను గట్టనాజ్ఞాపింపఁ దక్షణమే యొక దివ్యభవనము కట్టఁబడెను. నాకుద్రవ్యమును దీసుకొనిరమ్ము „అనివాడాజ్ఞాపించెను." „ఇదిగో నీవు కోరినంతద్రవ్యము" ని భూతముచూపెను. "ఈమహారణ్యమునుఖండించి గొప్పనగరము నొకదానినిర్మింపుమని" మరల సెలవొసంగెను. నిముషమాత్రమున నాభూతమట్లుచేసి „ఇదిగోయంతయును సిద్ధమయినది. ఇంకేమిచేయుదునో చెప్పుమని యడుగ, పాపమాబీదవాఁడు భయకంపితుఁడై తానింకనేమిచెప్పుటకును దోచకుండెను. ప్రతిదానిని నాభూతము రెప్పపాటు సమయములో జేయుచున్నది. ఇట్లుండ నాభూతము „నాకుపనిని జెప్పుము లేదేని మ్రింగివేసెద"నని భయపెట్టధైర్యహీనుఁడై యేమియు దోచక తిరిగి తిరిగి యాఋషియొద్దకుబోయి, „అయ్యా! నాప్రాణమును రక్షింపుఁడని యేడ్వసాగెను." ఋషి యేమియనివానినడుగ వాఁడు" ఈభూతమునకు పనిచెప్పుటకేమియుఁ దోచుటలేదు. నేనెంతపనినిచ్చినను నొక్కనిమిషమునఁ జేసివేయుచున్నది పనిఁ జెప్పనియెడల మ్రింగివేయుదునని భయపెట్టుచున్నద" ని చెప్పునంతలో నా భూతమువచ్చి మ్రింగివేయుటకు సిద్ధముగానుండెను. అంతటవాఁడు

గడగడవణకి ఋషిపాదములపైఁబడెను. ఋషివానితో "నేనునీకొకత్రోవచూపెదను; అదిగో ముణుచుకొనిపోయినతోకగల యాకుక్కనుజూచు నీవుతక్షణమే దానితోకనుగోసి నిబ్బరముగాజేయుమని దానికిమ్ము" నిచెప్ప వాఁడట్లుచేసెను. భూతమాతోకనుదీసికొని పదిలముగాదాని సాగదీసెను. గాని దానిని జేతిలోనుండివదలిన క్షణమే యదిమరలముణుచుకొనిపోయెను. ఇట్లేదానినెన్నిసారులుసాగదీసినను ముణుచుకొనిపోవుచునేయుండఁ జట్టచివరకు కొన్నిదినములకు విసిగివిసిగి "నాజన్మములో నేనెన్నడునునిట్టియవస్థను బొందియుండలేద" ని చెప్పివానినిబిలిచి వానితోనీవు నన్నువదలివేసినయెడల నేనునీకిచ్చినదంతయు నీకువిడిచిపెట్టి నిన్నుబాధింపకపోయెదననెను. వాఁడందులకపరిమితానందమును బొంది దానిని వెడలబుచ్చెను.

ఈప్రపంచమాకుక్కతోక రీతినున్నది. అనేకశతాబ్దములనుండి మానవులుదాని నిబ్బరముగాఁజేయప్రయత్నించుచున్నారు. కాని వారు దానిని వదలినతక్షణమది యెప్పటిరీతి ముణుచుకొనిపోవుచున్నది. అది మఱియొకరీతినెట్లుండును? అనుబంధమునువిడనాడి కార్యములనుజక్కఁ జేసికొనుపద్ధతిని మొదటనేర్చుకొనవలెను. తరువాతనట్టివాఁడెన్నటికిని మతాభినివేశమునుఁ బొందకుండును. ప్రపంచమాకుక్క వంకరతోకరీతి నున్నదనియు దానినితిన్నైనమార్గమునకుఁ దీసికొనివచ్చుటసంభవమనియు నెఱింగినయెడల మనము మతాభినివేశకులము గాకుందుము. మతాభినివేశ మీప్రపంచమున నుండకపోయినయెడల నిప్పటికన్న నెక్కువవృద్ధిని బొందియేయుండును. జనసంతతికే మతాభినివేశమువృద్ధినిఁగలుగఁజేయునని తలచుట బుద్ధిహీనతగాని వేరొకటిగాదు. మానవులనింతకన్న హెచ్చుదశకుతేకుండుటయేగాక ద్వేషము, అసూయ మొదలగు మనోవికారములఁ బుట్టించుటవలనను సోదరభావమును బోగొట్టి

యొకరితో నొకరు కలహములఁ జెందునట్లు చేయుటవలనను నీమతాభినివేశము మనుజులను క్షీణదశకు దెచ్చుచున్నది. మనముచేయుకార్యములన్నియు నుత్కృష్టమైనవనియు మనముచేయనివి నిష్ప్రయోజనమైనవనియు మనముతలంచుచునేయుందుము. గాన మతాభినివేశమును బొందుదమని యెన్నఁడైనసీకుఁదోఁచినచో నాకుక్కవంకర ప్రసంగమును జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము. ప్రపంచవర్తనమునకై నిద్రాహారములులేక నీవు వేసారియుండనవసరములేదు. నీవులేకపోయినను ఎప్పటిరీతినది పోవుచునేయుండును. మతాభినివేశమునుండి తొలగినప్పుడే నీవుచక్కగాపని చేయుదువు. నెమ్మదైనవాఁడును దీర్ఘాలోచనపరుఁడును దయారసమును సోదరభావమును గలవాఁడుమాత్రమే పుణ్యకార్యముల నాచరించి తనకుమేలుచేసుకొనఁగలఁడు. మతాభినివేశకుఁడు మూర్ఖప్రాయుఁడు. తోడివారల సోదరభావమునఁ జూడఁజాలఁడు. ప్రపంచమునువాఁడెన్నఁడును తిన్ననైన త్రోవబెట్టఁజాలడు. తానైనను సిద్ధినిబొందలేదు.

ఈనాటి యుపన్యాసములో ముఖ్యాంశములనిచ్చట సంగ్రహముగా జెప్పటలో ప్రథమమున ప్రపంచమునకు మనమందరము జాలనుపకారము జేయవలసియున్నదిగాని ప్రపంచముమాత్రము మనకేమియుజేయవలసియుండలేదని మనసునందుంచుకొనవలెను. ప్రపంచాభివృద్ధికై మనమేమియైనచేయుటకు సావకాశముకలుగుటయే మనకుఁ జాలయదృష్టము. ప్రపంచమున కుపకారమొనర్చుట మనయుపకారమునకే, రెండవయంశమే మననీసృష్టికంతకును భగవంతుఁడొకఁడున్నాడనుట. ఆదినీసహాయమునుగాని నాతోడునుగాని యపేక్షించి నిరాధారముగానున్నదని జెప్పుట కేవలముసత్యము. దేవుఁడెప్పుడును దానినిఁ జూచుచునేయున్నాఁడు. అతఁడాద్యంతములు లేనివాఁడు. విరామములేక తనయసమాన తేజోబలంబున నాతఁడెప్పుడును తనధర్మమును తా

ను నెరవేర్చుచునేయుండును. ప్రపంచమంతయును నిద్రించుచున్నను నాతఁడు నిద్రనొందఁడు. సకలమునైనమార్పులును నాతనివే. మూఁడవయంశమేమన మన మెవ్వనినిగాని నిందింపకూడదు. ప్రపంచమెప్పుడును పుణ్యపాపసంకలితమైయుండును. మనముబలహీనులకుఁదోడుపడుచు పాపకార్యాసక్తులను దయతోఁజూచుచునుండవలెను. ప్రపంచముజ్ఞానాభివృద్ధిని జేయునొక శాలగానున్నది. దానియందు మనము పరిశ్రమచేసి మనయాత్మజ్ఞానాభివృద్ధిని ధృడపర్చుకొనవలసియున్నది. నాల్గవయంశమేమన మనమెన్నఁడునుఏవిధమగు మతాభినివేశకులమునుగాకూడదు. మతాభినివేశము ప్రేమను తొలగించివేయును. "నేను పాపమునే దూషించుచుంటినిగానిపాపకార్యముచేసిన మనుజునిదూషించుటలేదని" మతాభినివేశకులు జెప్పుచుండ వినియే యుందురు. గాని పాపమునకును పాపకార్యముచేసినవానికినిగల తారతమ్యమును స్పష్టముగా జెప్పగలిగిన వాఁడైననున్నయెడల వానినిఁజూచుటకై నేనెంతదూరమైనను బోవుటకు సిద్ధముగనున్నాను. చెప్పుటమాత్రము చాలసులభము. గుణమునకును పదార్థమునకునుగల తారతమ్యమును గ్రహింపగల్గెడు శక్తియే మనకుండినయెడల మనమీపాటి పరిపూర్ణులమైయుందుము. దానిని జేయుటంత చులకనైనపనిగాదు. మరియుమన మనసెంత నెమ్మదిగానుండునో మనప్రేమయు నంతయెక్కువగానుండును. దానినిబట్టి మనకార్యములుగూడనంత మంచివై యుండును.





# కర్మయోగము.

## ఆరవ ప్రకరణము.

### నిస్సంగమనగా—పూర్ణమైన వైరాగ్యము.

### (Non-attachment is Complete selfabnegation)



మనముచేయు ప్రతికార్యమును ప్రతిక్రియారూపమున మనకడకు మరలవచ్చునుగనుక మనకార్యమితరులమీదను వారివిమనమీదను పనిచేయును. దుష్కార్యములను జేయువారంత కంతకు దురాత్ములగుటయు, సత్కార్యములను జేయువారంత కంతకు సత్పురుషులగుటయును మనము తరుచుగా, గనిపెట్టవచ్చును. ఈప్రకారము కార్యాచరణమువలన మనగుణములు బలపడుటకు కార్యము ప్రతిక్రియ. వీనియొక్క పరస్పరానుబంధమే కారణము గాని మఱియేదియును గాదు. పదార్థవిజ్ఞానశాస్త్రమునుండి యొక యుదాహరణమును దీసికొందము. మనమేదయిన నొకపనిని జేయుచున్నప్పుడు మన మనసొక విధమయిన కంపనమును గలిగియుండును. అప్పుడు అదేవిధమయిన కంపనమును గలిగియుండు మనస్సులన్నియును మన మనసుతో నేకీభవించెడు ధోరణియందుండును. ఒకగదిలో కొన్ని ఫిడేళ్ల నొక్కశ్రుతికి మేళవించియుంచి యందొకదాని వాయించితిమేని తక్కినవిగూడ ఆస్వరమునే వాయించనక్కఱ లేకుండ పాడెడు స్వభావమును మనమందరము కనిపెట్టవచ్చును. అట్లేమన ధోరణులుగూడ పరస్పరానుబంధమును

గలిగియుండును. ఈయనుబంధము దూరము మొదలగు స్థితులనుచుట్టు మారుచుండుట నిక్కమేగాని మనస్సునకట్టి స్వభావముండుట మాత్రము నిశ్చయము. నేనొక దుష్కార్యమును జేయుచున్నాననుము. అప్పుడు నామనసొక విధమయిన స్పందనముతో నుండును. లోకములోనట్టి స్థితియందున్న మనస్సులన్నియుగూడ దాని ననుసరించు నవకాశము మాత్రముకలదు. అట్లే నేనొక సత్కార్యమును జేయుచున్నప్పుడు నా మనస్సు మరియొకవిధమయిన స్పందనమును గలిగియుండును. అట్టి మనస్సులన్నియు దానిననుసరించ జూచుచుండును. మనస్సులయొక్క యీయనుబంధము వానియొక్క దృఢత్వమును బట్టియుండును.

ఈయుపమానమునే యింకను విస్తరింపజేసి చూచినయెడల తేజోతరంగములేదేనియొక పదార్థమును జేరుటకు కొన్నిలక్షలయేండ్లు పట్టినట్లు ఊహాతరంగములుగూడ తమకు మిత్రములైన మనస్సులను జేరుటకు కొన్నిలక్షల సంవత్సరములు ప్రయాణము జేయవలసివచ్చును. కాబట్టి యీమనచుట్టునున్న యాకాశమును దట్టి యూహాతరంగములు వేనవేలు నిండియుండవచ్చును. మేదస్సునుండి బయలుదేరిన ప్రతియూహయును దానిమిత్రమును గలుసుకొనువఱకు నట్లుకొట్టుకొనుచు దిరుగుచుండును. వీనికనుగుణములయిన మనస్సులు వానిం గ్రహించుచుండును. కాఁబట్టి మనుష్యుఁడు దుష్కార్యములు చేయుచున్నప్పుడు వాని మనసొకవిధమయినస్థాయియందుండును. ఆస్థాయియందున్న తరంగములన్నియు వాయుమండలములో నున్నవి. మనస్సున బ్రవేశించుటకు బ్రయత్నించును. అందుచేత నామనస్సున కాఘోరణియే బలపడి దుష్కార్యములందాసక్తి మెండగును. అట్లే సత్కార్యము లొనరించునప్పుడును జరుగును. ఆకాశమందున్న సత్కంపనములు ఆమనస్సునందు బ్రవేశించి సద్బుద్ధిని బలపరుచును. కాఁబట్టి దుష్కర్మ చేయుటలో రెండు

బాధలుగలవు. దానివలన మనచుట్టును దుస్సాంగత్యమునకు మనము లోనగుట యొకటి. పాపతరంగములను బుట్టించి వానివలన నెన్నివేల యేండ్లకైన నొకరిని జెరుపుట రెండవది. కాబట్టి పాపకార్యముల వలన మనము మనలను పరులనుగూడ జెరుచుచున్నాము. పుణ్యము చేయుటవలన నట్లే మనలను ఇతరులను గూడ బాగుచేయుచున్నాము. మనుష్యునందున్న తక్కిన యితరశక్తులన్నిటివలెనే యీపుణ్యపాపశక్తులు గూడ బాహ్యాసాంగత్యముల వలన బలపడుచున్నవి.

కర్మయోగమునుబట్టి యొకడొనర్చిన కార్యము దానిఫలము ఫలింపకముందు నాశనమును బొందదు. ఎట్టిశక్తియైనను దానిఫలమును ఫలింపకుండునట్లు జేయజాలదు. నేనేదియేని పాపకార్యమును జేసితినేని దానిఫలమును ననుభవించి తీరవలెను. సృష్టియందేదియును దానినాప జాలదు. అట్లే నేనేదేని పుణ్యకార్యమును జేసితినేని నదియును పుణ్యఫలమునిచ్చితీరును. ప్రతికార్యమును దానిఫలమును గలిగియే యుండును. ఫలములేకుండుట కేవల మసంభవము. ఇప్పుడు కర్మయోగ సంబంధమన పుణ్యకార్యములును పాపకార్యములును నొకదానితో నొకటి గాఢమగు ననుబంధమును గలిగియున్నవనెడు నంశమును మనము విచారింపవలసియున్నది. ఏకార్యమునుగాని మనమిది కేవలము పుణ్యకార్యమనిగాని లేక కేవలము పాపకార్యమనిగాని స్పష్టముగా చెప్పజాలము. పుణ్యపాపముల రెండింటినిసమ్మేళనముగా గలిగియుండని కార్యమేదియును లేదు. యీయంశమును జూదుము. నేను మాటలాడుచున్నాను. మీలోకొందరు నేను జేయునది చాలామంచి కార్యమని యెంతురు. గాని నేనాసమయమునసే వాయువులో సంచరించు క్రిమిజాలముల వేనవేలుగా జంపుచున్నాను. నేనట్లు మరియొకదానికి హానిగలుగజేయుచున్నాను. ఏకార్యమయినను మన సమీపమునుండి మ

మెలింగిన వారికి మేలునుగలుగజేసెనేని యాకార్యము మంచిదని మనము తలంతుము. నాయుపన్యాసమును మీరందరునుగూడ గొనియాడి పుణ్యకార్యమని యెంచవచ్చును గాని క్రిమిజాలములు మాత్రమట్లు తలంపవు. ఆక్రిములను మీరుగానలేరు. మిమ్ములనుమాత్రము మీరు జూడగలరు. నాయుపన్యాసము మీకెట్లుండునో మీరు స్పష్టముగా గానగలరుగాని క్రిమిజాలము దానినెట్లు పరిగణించునో మీకు తెలియదు. ఇట్లే పాపకార్యమునుగూడ పరిశోధించి చూచితిమేని నవియును నెక్కడనో యొకచోట పుణ్యమును జేయుచునే యుండవలెను. పుణ్యకార్యములందుగూడ గొంత పాపమున్నదనియు నట్లే దుష్టకర్మలయందును కొంతపుణ్యమున్నదనియు దెలిసికొనగలిగినవాడు కర్మయొక్క రహస్యమును గనిపెట్టగలడు. గావున దీనినుండి మనమెంత ప్రయత్నము చేసినను కేవల నిర్మలకార్యమునుగాని లేక పూర్ణమయిన పాపకార్యమునుగాని మనము గననేరము. ఇతరులకు హానిని కలుగజేయక మనమీ ప్రపంచమున జీవించలేము. మనము తినుచున్న యాహారమంతయు నితరుల నోటినుండి లాగుకొనుచున్నదియే. మనజీవితములే వారిజీవితముల నణగద్రొక్కుచున్నవి. వారు మానవులుగావచ్చును లేక మృగములు గావచ్చును. వీటిలో నేదోయొక దానికి మనము నాశనమును గలుగజేయుచున్నాము. ఈవిషయమిట్లున్నదిగాన కర్మవలన జేయుచునే యుండవచ్చును. నీవు విరామములేక కర్మలను సిద్ధినిబొందుచున్నటికిని సాధ్యముకాదు. గాని యాకర్మలఫలమ్ము మాత్రమెన్నటికిని పుణ్యపాపసంకలితములుగానే యుండును.

కర్మకంత్య మెప్పుడు అనునది మనకు విచారణీయమయిన యంశమయి యున్నది. ప్రతిదేశమందును అనేకులు కొంతకాలమునకే ప్రపంచమున వ్యాధి, మృత్యువు, అసౌఖ్యము, క్రౌర్యము మొదలగు పాపకారణములన్నియు నశించి సృష్టియంతయు పూర్ణమయిన సిద్ధిబొం

చుననినమ్ముచున్నారు. ఇదియొక చక్కని యోచన. బుద్ధిహీనుల జ్ఞానమార్గమున బెట్టుటకిది చాలమంచిది. కాని సూక్ష్మబుద్ధితో నాలోచించిచూచినచో నది కేవలము విరుద్ధమగునట్లు ప్రత్యక్షముగా గాన్పించును. పుణ్యపాపములు రెండును నొకేనాణెముయొక్క తిరుగుమరుగులుగా నున్నపుడది యెట్లగును? పాపముతో సంకలితముగాని పుణ్యమును నీవెట్లు గాంచగలవు? సిద్ధియననేమి? సిద్ధినిబొందు జీవనమనుమాటయే తప్పు. మనకును, తక్కిన ప్రతిపదార్థమునకును గల నిరంతరమగు పోరాటమే జీవనమైయున్నది. ప్రతి నిముషమును మనము సృష్టితో బోరుచునేయున్నాము. మనమోడితిమేని మనజీవనముపోవును. నిజముగా నాపోరాటము ఆహారము కొరకును వాయువుకొరకును ఈ రెంటిలో నేది లేకపోయినను మనము బ్రదుకజాలము. జీవనము సులభమైనదియు నెమ్మదిగా దానితోడ్రోవ నడిబోవునదియుగాదు. అదియనేక కారణముల వలన గలిగినదై యున్నది. బహిస్సృష్టికిని అంతస్సృష్టికినిగలయీనిరంతర ఘోర వైరమునే జీవనమని పిలుచుచున్నాము. గాన నీవైరమెప్పుడంత మొందునో అప్పుడే యీజీవనమును నాశనత్వమును జెందును. ఈ వైర నాశనానంతరముననే మనము శాశ్వతసుఖమునుబడయుట. అప్పుడే మన జీవనము గూడ నశించును. ఏలయన జీవనము నశించినగాని యీ వైరము నశింపదు. ప్రపంచమునకు సహాయమొనర్చుటవలన మనల నభివృద్ధికి దెచ్చుకొనుచున్నారమని యిదివరకే మనకు దెలియును. ఇతరులకై మనముసేయు కర్మలఫలమంతయు మనల పరిశుద్ధుల జేయుటకే పరోపకారమునకై మనమెడతెగక పనిజేయుటచే మనలను మనము మరచిపోవుచున్నాము. ఈస్వార్థనిరసనయే మనమీ జన్మమున నేర్చుకొనవలసిన విషయము. తననుతాను సుఖవంతునిగా జేసికొనగలనని మానవుడు వెఱ్ఱియూహలపడుచున్నాడు. అనేకవత్సరములువిరామము

లేని వైరముతో నుండినతరువాత చిట్టచివరకు సౌఖ్యమంతయు స్వలాభాపేక్షను నశింపచేయుట యందున్నదనియు తనను తానుతప్ప మరెవ్వడును సుఖవంతునిగా జేయలేడనియు దెలిసికొనుచున్నాడు. ప్రతిధర్మకార్యమును ప్రతిసోదరభావమును, ప్రతియుపకారము ప్రతిపుణ్యకార్యమును, మనలనుండివిశేషమగునాత్మగౌరవమును బోగొట్టుచు మనము మిక్కిలి తక్కువవారమని యనుకొనునట్లుజేయుచున్నవి గానన చి చాలమంచిది. ఇక్కడనే జ్ఞాన, భక్తి, కర్మలు మూడును నొకచోటకు జేరుచున్నవి. ఉత్కృష్టజన్మ మెప్పటికిని శాశ్వతమే. అదియే స్వార్థనిరసన అక్కడ „నీ" వనుమాటయేగాని „నేన" నునదెంతమాత్రమును లేదు. మానవుడు దాని నెఱింగినను నెఱుగకపోయినను చిట్టచివరకు కర్మయోగమాతని నీకడకు జేర్చును. ఒకమతబోధకుడు నిర్గుణుడైన మనిన ఘోరముగా నెంచవచ్చును. అతడు సగుణుడైవమునే నిర్ధారణ చేయవచ్చును. కాని యాతని నీతి ధర్మములకుమాత్రము వైరాగ్యమాధారముగాక తప్పదు. అదియే నీతికంతకు మూలము. మనుష్యుల విషయమునవేగాక జంతువుల విషయమున గూడ నిదియేవాస్తవము. నీతిశాస్త్రముల కన్నింటికి నిదియే యాధారము.

ఈప్రపంచమున ననేకరకములగు మానవులుగలరు. మొట్టమొదట స్వార్థనిరసనమున ప్రాగ్రత్వమును బొంది తమజీవనముల ధారబోయవలసివచ్చినను పరోపకారమే తమ ధర్మమనియెంచు దైవభక్తులు కొందరుగలరు. వీరలే మానవసంతతి కంతకు నుత్కృష్టులు. ఏదేశము నగాని నిట్టివారలు నూర్గురైన నున్నయెడల నాదేశము దైన్యమును బొందనవసరములేదు. గాని దురదృష్టవశమున నట్టివారలు మిక్కిలి తక్కువగా నున్నారు. వీరితరువాత మరియొక రకమువారు గలరు, వారలు తమకు హాని కలుగునంతవరకు నితరుల కుపకారము జేయు

చుందురు. ఇతరులకు హాని కలిగినను తమసౌఖ్యము నే కోరి కార్యముల జేయు మూడవజాతివారుగూడ కొందరుగలరు. తమ కుపకారము ఏమియు లేక పోయినను ఇతరులకుహానికలుగుటయే ప్రధానముగా నెంచెడు నాలుగవతరగతివారుగూడ గలరని సంస్కృతకవియొకడు చెప్పియున్నాడు. సృష్టియందలియొకకొనను పుణ్యకార్యాచరణమే ప్రధానముగా నెంచితమకెంతహాని గలిగినను పాటింపక పరోపకారము నే జేయు మహానీయులెట్లుండిరోనట్లే దాని రెండవకొనయందు పాపకార్యాచరణమే ప్రధానముగా నెంచి తమకే సౌఖ్యమును లేకపోయినను ఇతరులకుహానిని జేయువారును గలరు. దానివలన వారుబొందు లాభమేదియులేదు. గాని పాపమును సంపాదించుటయే వారిస్వభావము.

ఈసందర్భమున "ప్రవృత్తి" నివృత్తి" యను సంస్కృతపదములు రెండుగలవు. "ప్రవృత్తి" యన నొక దానిసమీపమునకు బోవుట "నివృత్తి" యన నొకదానినుండి దూరముగా బోవుట. ప్రపంచమున నేను, నాది, యని పిలువబడుచున్నది ప్రవృత్తియే. ఆ "నేన"నుదానిని ప్రజలము చేయుచున్నభాగ్యము, బలము, పేరు మొదలగునవియు నిట్లే ప్రతిదానిని "నేన"నుదానితోఁ జేర్చుస్వభావముగల వస్తువులన్నియును యాప్రవృత్తియందు జేరుచున్నవి. యీప్రవృత్తియే ప్రతిమానవుని యొక్కయు స్వతస్సిద్ధమయిన స్వభావమైయున్నది. ఆతఁడు ప్రతిచోటనుండియును ప్రతివస్తువును దీసి తనయాత్మదగ్గరకుఁ జేర్చి యక్కడ గుట్టవేయవలెనని యోచించుచుండును. ఈస్వభావ మెప్పుడు విచ్ఛిన్నమగుటకారంభించునో యప్పుడు "నివృత్తి" యనునది ప్రారంభమగును. దైవభక్తియు సోదరభావమును నప్పుడే బయలువెడలును. "ప్రవృత్తి, నివృత్తి" యనునవి రెండును నొకేవిధమగు కార్యస్వభావము గలవియే, మొట్టమొదటిది పాపకార్యము రెండవదిపుణ్యకార్యము. ఈనివృత్తియే

సర్వమునకు నాధారమయియున్నది. ఇదెపుడు పూర్ణముగా వృద్ధినిబొం దునో యపుడే మానవుఁడు తన మనసును దేహమునుగూడ నితరులకు ధారవోయఁగలుగు చున్నాఁడు. అతఁడపుడె కర్మయోగముయొక్క సారమును పూర్తిగా గ్రహించిన వాఁడగును. పుణ్యకార్యములయొక్క యుత్కృష్టఫలమిదియే. అతఁడెన్నఁడును, నేవేదాంత భాగమునుగాని చదువకపోయినను, దేవునియందాతని కెంతనమ్మకము లేకపోయినను, నాతఁడెప్పుడును భగవధ్యానమును జేయనివాఁడైనను పుణ్యకార్యముల ఫలమే యాతని ప్రాణమునైన నిచ్చి పరరక్ష చేయఁగలిగెడు స్థితికి దెచ్చెనేని దైవభక్తుఁడు తన భక్తిచేతను వేదాంతి తన జ్ఞానముచేతను నేస్థానమును బొందుచుంటిరో దానినేయాతడును తనపుణ్యకర్మవలనఁ జేరుచున్నాఁడు. గాన వేదాంతియు కర్మిష్ఠియు భక్తుఁడును జిట్టచివర కొక్క స్థానముననే బోవుచున్నారు. ఆస్థానమే స్వార్థనిరసన స్థానము. వారి వేదాంతమును, దైవభక్తియు, నెంతవేరైనను పరులకై తన ప్రాణమును నర్పణచేయుటకు సిద్ధమగు మహనీయునియెడల మానవసంతతంతయు విశేషమగు కృతజ్ఞతను నొకవిధమగు భయమును బొందకుండుట జాలయరుదు. ఇక్కడేవిధమగు సందేహములునుసడ్డురావు. అన్ని మతాభిప్రాయములకును విరుద్ధస్వభావముగలవారు కూడ ప్రాణములనైనధారవోసిపరోపకారము చేయబడినట్టి యుత్కృష్టకార్యమేదైన నొకదానిఁజూచినచో కొనియాడక మానరు. స్వార్థత్యాగమును దప్ప మరేదేవునిగాని బోధింపని బుద్ధినిఁగురించి యెంతమూఢభక్తిగల క్రైస్తవుడైనను ఎడ్విన్ ఆర్నాల్డు వ్రాసిన బుద్ధచరిత్రమును జదివినచో జేతులుజోడించివానికి ప్రొమొక్కకుండఁ నుండగలడా? కానిపాపమూఢభక్తుఁడు. మతద్వేషులని తాను నిందించెడువారు జేరనున్నస్థానమును తానుజేర బ్రయత్నించుచు స్థానమును నొక్కటియే యని యెఱుగఁడు.

నై దైవభక్తుఁడును దేవుని నే తన మనంబున నిడికొని పుణ్యపరివేష్టితుఁడై చి ట్టచివరకీస్థానమునకే వచ్చి "నీయాజ్ఞయే చెల్లుగాక" యని చెప్పుచు సర్వ మును త్యజించుఁగాన కర్మ, భక్తి, జ్ఞానమునను మూఁడును నిక్కడనే గలుసుకొనుచున్నవి. పూర్వకాలపు మహనీయులు భగవంతుఁడు ప్ర పంచముగాఁడని చెప్పుటయందుండు నర్థమిదియే. ప్రపంచము వేఱు భగవంతుఁడు వేఱు. ప్రపంచమనునదొకటి, దేవుడనునది మఱియొకటి ఈభేదము నిశ్చయమయినది. ప్రపంచమన స్వార్థపరత్వము, దానియ భావము దేవుఁడు. ఒకఁడు కనకహర్మ్యములయందు సింహాసనాసీనుఁ డై యుండియు స్వార్థపరుఁడుగాక యుండవచ్చును. అట్టివాఁడు భగవం తుని యందున్నవాఁడగుచున్నాఁడు. ఇంకొకఁడు పర్ణశాలయందు నివ సించుచుఁ జీర్ణవస్త్రములను గట్టుకొనుచుండి లోకమున నేమియు లేని వాఁడయ్యును స్వార్థపరుఁడై యుండి లోకమున మునిగియుండును.

మరలమన మొదటి విషయమునకు వత్తము. మనము పాపరహి తమైన పుణ్యకర్మనుగాని పుణ్యరహితమైన పాపకర్మనుగాని యాచరించ నేరము: ఈసంగతి తెలిసికొనిమనమింక కర్మనెట్లాచరించగలము? ఇందు చేత నేకొన్ని శాఖలు బయలుదేరి నెమ్మదిగా నాత్మహత్య చేసుకొనుటయే సంసారవిముక్తికి సాధనమనియుమనుష్యుఁడు బ్రతికి యుండినయెడల ననే కములయిన యల్పప్రాణులను జంపవలసి వచ్చుననియు విపరీతబోధ చేయసాగిరి. కాబట్టి వారిసిద్ధాంతప్రకారము లోకమునుండి విముక్తికి సాధనము మరణమే. జైనులీ సిద్ధాంతమునే ప్రధమధర్మముగా బోధిం చిరి. ఇది మిగుల సహేతుకముగా గాన్పించుచున్నది. కాని దీని నిక్క మయిన పరిష్కారము గీతలయందు జేయబడియున్నది. అదియే సంగ త్యాగము. ఫలాసక్తుఁడుగాకుండ కర్మనాచరించుట. నీవుప్రపంచమును లేదని యెంచుకొనవలెను. నీవు లోకమున నుంటివనియు నీవు చేయున

దేదియును నీకొఱకుఁ గాదనియు తలంచుము. నీకొఱకై నీవు చేయుప్రతికర్మమునకును ఫలము నిన్నంటును. అదిసత్కర్మమైన సత్ఫలమును దుష్కర్మమైన దుష్ఫలమును నిన్ను పొందును కాని నీకొఱకుఁగాని కర్మ యెట్టిదయినను దానిఫలమునిన్నంటదు. ఈయర్థమునే శాస్త్రములందిట్లు వక్కాణించియున్నాడు ,,ఒకఁడు లోకమునంతను నిశింపఁ జేసినను దాను గూడఁ జచ్చినను అతఁడు చంపెడువాఁడునుగాఁడు. చంపఁబడినవాఁడును గాఁడు. ఎప్పుడు? తానుతనకొఱకు కర్మనాచరించుట లేదని తెలిసికొని నప్పుడు" కాఁబట్టి కర్మయోగము లోకమును విడిచిపెట్టక లోకమున నుండి యందలియనుభవములను సంపాదించవచ్చునుగాని యిదియంతయు నీకొఱకయినయెడల కర్మయే చేయవలదు. స్వానుభవమునకు లక్ష్యముగానుండరాదు. మొదటస్వశబ్దమును జంపుకొని తరువాతలోకమంతయు నీవేయని చింతించుకొనుము. క్రైస్తవులు చెప్పునట్లు వృద్ధుఁడుమరణము నొందవలెను. ఆవృద్ధుఁడెవఁడు? సర్వలోకములను మనసుఖమున కేర్పడినవే యను నభిప్రాయము మూఢులను తల్లిదండ్రులు ,,ఓభగవంతుఁడా? నీవు సూర్యచంద్రులను నాకొఱకు సృజించినావు" అని భగవంతునికిపసిబిడ్డలకుఁగావలసినదెల్ల సృష్టించుటకంటె వేరేమియు పనిలేనట్లుప్రార్థించుచుందురు. మాబిడ్డలకట్టి తెలివితక్కువ ప్రార్థనలను బోధింపరాదు. మఱికొందరింకొకరీతిమూర్ఖతకు లోనగుచున్నారు. వారి జంతువులన్నియు మనముజంపి తినుటకే పుట్టింపఁబడినవనియు సమస్త ప్రపంచమును మనమనుభవించుటకే యనియుఁ జెప్పుదురు. ఇదంతయు మూర్ఖతయే. ఒక పెద్దపులి యిట్లు ప్రార్థించవచ్చును. ,,మనుష్యుఁడు నాకొఱకై సృజింపఁబడినాఁడు. ఓభగవంతుఁడా ఈమనుజులువచ్చి నా నోటఁబ్రవేశింపకున్నారు చూచితివా వీరిదుర్మార్గము వారు నీశాసనము నతిక్రమించుచున్నారు అని దేవుని ప్రార్థింపవచ్చును. ప్రపంచము

మనకొఱకు పుట్టినమనము ప్రపంచముకొఱకు పుట్టినారము. ఈలోకము మనకొఱకు సృజింపబడినదను ఘోరాభిప్రాయమే మనలనడఁగఁద్రొక్కుచున్నది.

ఈలోకము మనకొఱకుగాదు. ఏటేట లక్షలకొలదిజనులు దీనివిడిచిపోవుచున్నారు. దానలోకమునకుఁ గొదువగలుగుటలేదు. అనేకలక్షలమంది పుట్టుచున్నారు. మనకు ప్రపంచమెట్టిదో యట్లే ప్రపంచమునకు మనమునయి యున్నారము.

కాఁబట్టి క్రమముగా కర్మనాచరించుటకుఁ దానియందు సక్తతపోవలెను. మఱియు నాకలహములో నైక్యముగాక సాక్షీభూతుఁడై యుండవలెను. "నీపిల్లలను దాదిచూచినట్లు చూడమని" మాగురువు చెప్పుచుండెను. దాదిమనపిల్లలనెత్తుకొని ముద్దులాడి తనబిడ్డలవలెనే వాండ్రతో ముచ్చటలాడుచుండును. ఇట్లుండినీవు పొమ్మనిచెప్పగానే మూటగట్టుకొనిపోవుటకు సర్వసిద్ధముగా నుండును. దానియందుండు మమకారమంతయు విస్మృతమగును. నీబిడ్డనువిడిచి యింకొకరిబిడ్డలను బెంచుటకామె కించుకైన పరితాపముండదు. మీరుకూడనాప్రకారము నాదియనుకొను ప్రతివస్తువునందు నట్లుండవలెను. నీవేదాదివి నీకు భగవంతుఁడు కలఁడను నమ్మకమున్నయెడల నీపిల్లలను కొనువారందరు వానిపిల్లలని యెంచుకొనుము. గట్టిలోపమేదికలదో యది గొప్ప సుగుణముగాను బలముగానుదోఁచును. కొందరికి మనమాధారమనియు మనమూ పరులకుపకారము చేయఁగలమనియుఁ దలంచుట గొప్పదోషము. ఈనమ్మకమే మమకారమునకు హేతువు. ఆమమకారమే మనబాధలన్నిటికి మూలము. మనయక్కఱ యెవరికిని లేదని మనమనస్సునకు బోధించవలెను. ఒకముష్టివాఁడును మనధర్మమునాశించి యుండడు. ఒకఁడును మనదయనుగోరియుండడు. ఒకప్రాణియు మనసాయము నపే

క్షించియుండదు. ప్రకృతియే యన్నింటికిని గావలసిన సాయము నొసంగుచున్నది. మనవంటివారలెంతమంది లేకుండఁబోయినను ఆసాయము నకు లోటుకలుగదు. ప్రకృతి గమనము నీకొఱకును నాకొఱకును ఆగియుండునది కాదు. ఇదివరలో చెప్పియున్నట్లుగా పరోపకారమొనర్చుటకు మనకుఁగూడ నవకాశముగలుగుటచేతను తనూ్మలమున మనకుజ్ఞానముకలుగుటచేతనుమనముధన్యులమగుచున్నాము. ఇదిమనము నేర్చుకొనవలసినగొప్పవిషయము. దానినిపూర్తిగా తెలిసికొంటిమేని మనకెన్నఁడును దుఃఖముకలుగదు. మనమెక్కడికిబోయినను బోవచ్చును. నీకెందరు భార్యలున్నను భర్తలున్నను బిడ్డలున్నను ఎందరుసేవకులున్నను ఏలుట కెంతరాజ్యమున్నను లోకముమనకుఁగాదు. దానికిమనయవసరము లేదు అనుధర్మము ప్రకారము నడచుకొంటివా యివియెన్నియున్నను నిన్నేమియు చేయఁజాలవు. నీమిత్రులలోఁ గొందరీ సంవత్సరమే మృతినొందవచ్చును. వారుతిరిగివచ్చువఱకు లోకవర్తనమాగుచున్నదా? దానిప్రవాహామడ్డినదా? లేదు. అదిజఱిగిపోవుచునే యున్నది. కాఁబట్టి లోకమునకు నీవేదోయుపకారము చేయవలసియున్నదను నభిప్రాయమును మనసునుండి పారఁదోలవలెను. లోకమునకు నీసహాయమేమియు నక్కఱలేదు. తానులోకమున కుపకారముచేయఁటకై పుట్టితినని తలంచుట కేవలము తెలివితక్కువ. అదివట్టిగర్వము. సుగుణమని భ్రమపెట్టుచున్నస్వార్థపరత్వము ప్రపంచమునకు నీయవసరముగాని మఱియెవ్వరి యవసరముగాని లేదను నభిప్రాయము బాగుగానీమనస్సున కనుభవములోనికివచ్చి నాటినయెడల నింకకర్మకు ప్రతిఫలముగా బాధయెన్నఁడును గలుగదు. నీవొకని కుపకారముచేసి తత్ఫలము నపేక్షించక యతనికృతజ్ఞతనైనను వాంఛించకయుండినచో వానికృతఘ్నత నిన్ను బాధించనేఱదు. నీవుమొట్టమొదటనే వానికృతజ్ఞతనభిలషించి

యుండలేదు. వానికర్మానుసారముగా నీనుండి వానికి ముట్టవలసిన దేమో ముట్టినదనియు నీకర్మనుబట్టి నీవుదానికి కర్తవయితివనియుఁ దలంచి యూరకుందువు. ఎవరికో యేదోయిచ్చి దానికిఁ గర్వపడనేల? కర్మానుసారముగా నెవరికేదిముట్టవలెనో యదిముట్టును. దానిఁదీసికొనిపోవలసిన భారమునీపైపెట్టఁబడినది. అట్టివిషయమునఁ గర్వమునకవకాశమెక్కడిది? నీవులోకమునకిచ్చెడు దానిలో విశేషమేమియులేదు. వైరాగ్యమును నేర్చుకొనినవారికి పుణ్యమునులేదు పాపమునులేదు. మమకారమే పుణ్యపాపములకు భేదమునుగలిగించుచున్నది. ఇది తెలిసికొనుట మిక్కిలి కష్టసాధ్యమేగాని కొంతకాలమునకు లోకమునఁదేనికిని, నీవంగీకరించి లోబడిననేతప్ప, నీమీఁదనధికారములేదని తెలిసికొందువు. మనుష్యునియాత్మ యవివేకియై స్వాతంత్ర్యమును బోగొట్టుకొనువఱకును దానిమీఁద నెవరికి నధికారములేదు. గనుక వైరాగ్యమువలనఁ దేనిఁగాని నీపై నధికారము చెల్లింపనీయక స్వతంత్రుడవగుదువు. నాయిష్టములేనిది నాపై దేనికినధికారములేదని చెప్పుట కడుసుకరమే. కాని యట్లు దేనికిని లొంగక ప్రాపంచికములయిన సుఖదుఃఖములకు లోనుగాకుండువాని నిజమయిన లక్షణమేమి? వానిమనస్సు అదృష్టదశయందును దురదృష్టదశయందు నొకరీతిని నిశ్చలముగానుండును. సర్వావస్థలయందు నాతఁడొకే రీతినుండును.

హిందూదేశమున వ్యాసుఁడను నొకఋషికలఁడు. ఈవ్యాసమహర్షి బ్రహ్మసూత్రములను రచించిన మహానుభావుఁడు. అతనితండ్రి పూర్ణుఁడగుటకుఁ బ్రయత్నించెను గాని ధన్యత నొందఁజాలఁడయ్యెను. వానితాత ముత్తాతలు నట్లే విఫలమనోరథులయిరి. అతఁడును పూర్ణజయము సాధించలేకపోయెను. కానియాతనికుమారుఁడు శుకుఁడు పూర్ణుఁడై యుద్భవించెను. వ్యాసుఁడాతనికి జ్ఞానోపదేశముచేసెను. వానికి

సత్యమైన జ్ఞానమునుబోధించి జనకుని యాస్థానమునకుఁబంపెను. అతఁడొకగొప్పరాజు. జనకవిదేహుఁడని యాతనిపేరు. విదేహశబ్దమునకు శరీరము లేనివాఁడని యర్థము. రాజయ్యును తాను శరీరమునను మాట నాతఁడు పూర్తిగా మఱచిపోయెను. అతఁడెప్పుడు నాత్మనని యే యనుకొనుచుండెను. ఈశుకునకు శుశ్రూషకై యతనికడకేగెను. జనకుఁడును వ్యాసపుత్త్రుఁడు జ్ఞానముకొఱకు తనకడకు వచ్చుచున్నాఁడని యెఱింగినవాఁడై యందులకుఁదగిన యేర్పాటులను ముందే చేయించెను. ఆబాలుఁడు నగరద్వారమునకు వచ్చెను. ద్వారపాలుఁడు వానినేమియు సరకుచేయక యొక యాసనముమాత్ర మొసగెను. దానిమీఁద నాతఁడు మూఁడుదినములు మూఁడురాత్రులు గూర్చుండెను. వానితో మాటలాడినవారు లేరు. పలుకరించినవారు లేరు. నీ వెవ్వరవనిగాని యెక్కడనుంచివచ్చితివనిగాని యడిగినవారు లేరు. అతఁడుగొప్పమహర్షి కుమారుఁడు. వానితండ్రిని లోకమందరు గౌరవించుచుందురు. అతఁడును మిగుల గౌరవనీయుఁడు అయినను నీచులయిన యాద్వారపాలురు వానినించుకైన లక్ష్యముగా జూడరైరి. తరువాత నాకస్మికముగా మంత్రులును గొప్పయుద్యోగస్థులును అచ్చటికివచ్చి యాతనికి సమస్తగౌరవములును జేసి యాదరించి లోపలికిఁదోడ్కొనిపోయి దివ్యమందిరములందుఁబ్రవేశపెట్టి సురభిళాభ్యంజన స్నానములుచేయించి పింతమున్నులు గట్టనిచ్చి యీప్రకారమెనిమిది దినములు సమస్తభోగములును జరిపిరి. గాంభీర్యమై ప్రశాంతమైన యాతనిముఖమున నీయాదరణవలన నించుకేనియు వికారముగలుగక సేవకులనిరాదరణకెట్లున్నదో యట్లేయుండెను. ద్వారమువద్ద నున్నప్పుడెట్లుండెనో యీవైభవము ననుభవించునప్పుడు నట్లే యుండెను. తరువాత నాతనిని రాజసముఖమునకుఁగొని తెచ్చిరి. రాజు సింహాసనాసీనుఁడై యుండెను. సంగీతమును పాడుచుండిరి. నృత్యములు జరు

గుచుండెను. ఇంకను పెక్కువినోదములు జరుగుచుండెను. రాజుశుకునిఁ గాంచుటకు నొకగిన్నెలో పాలుబోసియిచ్చి దీనినిచేతఁబట్టుకొని యొక చుక్కయైన నొలుకకుండ నీసభచుట్టు నేడుమారులుచుట్టిరమ్మని శుకునితోఁ జెప్పెను. ఆబాలుఁడాగిన్నెను బుచ్చుకొని యీవినోదములకును సుందర వదనారవిందములకు నడుమబయలుదేరెను. రాజుచెప్పినట్లుసప్తప్రదక్షిణములను జేసివచ్చెను. ఒక్కపాలచుక్కయైన గ్రిందఁబడలేదు. అతని యంగీకారములేనిదే లోకమునందేవస్తువును వానిమనస్సునాకర్షింపఁ జాలదయ్యెను. ఆగిన్నెను బట్టికొని శుకుఁడు రాజుకడకు మరలరాఁగాఁ జనకుఁడు„నీకు మీతండ్రి చెప్పినదానిని నీవునేర్చుకొనినదానినిమాత్రమే నేనుమరల చెప్పఁగలను. దానివిశేషమేమియుఁ జెప్పఁజాలను. నీకుసత్యము తెలిసినది. ఇంటికేగుము" అనిచెప్పెను.

ఈప్రకారము స్వేంద్రియనిగ్రహముగలవానికి బాహ్యవస్తువు లెవ్వియును వికారమును గలిగించనేరవు. వానిమనస్సునకు స్వేచ్ఛగలిగియుండును. అట్టివాఁడుమాత్రమే లోకమునబాగుగా ప్రవర్తింపగలఁడు. కొందరు పూర్వభాగులయి „ఈలోకమంతయు ఘోరమయినది. ఎంతదుష్టమయినదో" యందురు. మఱికొందరు గుణగ్రాహులయి „ఈ లోకమెంత మనోహరముగానున్నది. ఎంతయాశ్చర్యము" అనియందురు. ఇట్లు మనోనిగ్రహము లేనివారికి లోకముచెడ్డదిగాగాని లేక మిశ్రితముగాగాని గోచరించుచుండును. మనకు మనోనిగ్రహము కలిగినయెడల నీప్రపంచమేమనకు పుణ్యపుంజముగాఁ గనఁబడును. పుణ్యముగాగాని పాపముగాగాని యేదియు మనమీఁదపనిజేయఁజాలదు. మనకన్నియు ననుకూలముగా యథాస్థానములందుండును. లోకము నరకమని చెప్పువాఁడుకూడ మనోనిగ్రహముకలిగినమీఁదట లోకముస్వర్గమని చెప్పుదురు. మనమునిక్కమైన కర్మయోగులమును యీస్థితికి రావలయు

నని ప్రయత్నించినయెడల మనమెక్కడ ప్రారంభించినను సంపూర్ణమైన వైరాగ్యమునఁ బర్యవసింతుము. అట్టియహంకారము పోయినతోడనే మొదట పాపపూరితమయినట్లుతోచిన యీప్రపంచమంతయు స్వర్గముగాను సుఖప్రదముగాను గోచరించును. దానిగాలియే సుఖప్రదమగును. ప్రతిమనుష్యుఁడును సత్పురుషుఁడగును. కర్మయోగము యొక్క ప్రయోజనము, పర్యవసానమునది. అదియాచరణమునట్టి పూర్ణదశకుఁదెచ్చును.

మనవివిధములయిన యోగములు పరస్పర విరుద్ధములుగావు. వానియందు ప్రతియోగమును కూడ యొకగమ్యస్థానమునకుగొనిపోయి మనకు పూర్ణత్వమునొసంగును. ప్రతిదానిని యథావిధిగా మాత్రమ భ్యసించవలెను. రహస్యమంతయు నభ్యాసములో నున్నది. మొదట వినవలెను. పిమ్మట యోచించవలెను. తరువాతనభ్యసించవలెను. ఇది ప్రతియోగమునకు నావశ్యకము. మొదట దానిని విని బోధపరచుకొనవలెను. మనకు దెలియని చాలవిషయములు శ్రవణమననముల వలనఁ బోధపడఁగలవు. ఏదిగానివెంటనే బోధపడుటకష్టము. దానికారణము మనమే. నిశ్చయముచేత నొకరికొకరు బోధించెడువారు లేరు. ఎవరికివారే బోధించుకొనవలెను. బాహ్యబోధకుఁడు లోపలనున్న యుపాధ్యాయుని మేలుకొలుపుటను మాత్రము చేయగలఁడు. అతఁడే లేచి బోధించును. మనబుద్ధి శక్తినిబట్టి విషయము మనకుబోధపడును. వానిని మన మాత్మానుభవమునకు దెచ్చుకొందుము. ఆయనుభవము బలపడి యిచ్ఛజనించును. మొదట నుద్దేశము పిమ్మటనిచ్ఛ దానినుండి కర్మశక్తి బయలుదేరును. అది మన శరీరమంతట వ్యాపించి దానిని మమకార రహితమైన యోగమున కుపకరణముగా చేయును. దాన పూర్ణమైన వైరాగ్యమును నిశ్చయమైన యహంకార శూన్యతయు

సిద్ధించును. ఈసిద్ధి కేసిద్ధాంతమును ఆధారముగాదు. క్రైస్తవునయినను సరే యూదునైననుసరే యెవరైనను భేదము లేదు. మమకారశూన్యుఁడవై యున్నావా? అనునదొక్కటియే ప్రశ్న. అట్లున్న యెడల నొక్క పుస్తకమయినఁ జదువనక్కర లేదు. ఒక్క యాలయమునకైనఁ బోనక్కఱ లేదు. నీకుపూర్ణత్వము లభించును. మనయోగములలో ప్రతియోగమును తక్కనవక్కఱ లేకయే మనుజునికి పూర్ణత్వమును కలుగఁ జేయునదై యున్నవి. ఏమనిన- వాటికన్నిటికిని గల్గుపదవియొక్కటియే. భక్తియోగము, కర్మయోగము, జ్ఞానయోగము, నన్నియుఁగూడ మోక్షమునకుఁ బ్రత్యక్షసాధనములే. "కర్మజ్ఞానములు వేఱని వారుమూఢులు. పండితులట్లు చెప్పరు. పైకవి వేరుగా గోచరించినను పరమావధి యొక్కటిగనే యని పండితులెఱుఁగుదురు."



# కర్మయోగము

## ఏడవ ప్రకరణము.

## ముక్తి (Freedom)



కర్మశబ్దమునకు పనియను నర్థమేగాక మానసికముగా జూచిన యెడల కారణముఁ గూడ తాత్పర్యమగు చున్నది. ఫలమును గలిగించు నేపనియైనను ఊహయైనను కర్మయనఁబడుచున్నది. కావున కర్మసూత్రమనగా కార్యకారణ సూత్రమగుచున్నది. కారణ మెక్కడ నున్నను దానికి ఫలముండి తీరవలెను. అదితప్పదు. ఈకర్మ ధర్మము విశ్వమంతట సత్యముగా నున్నది. మనమేదిచూచినను ఏమిచేసినను ఈ విశ్వమున నెక్కడనేకార్యమున్నను దానికి పూర్వకర్మ కారణమై యీ కర్మ మరల ముందునకు ఫలప్రదమగుచున్నది. దీనితోఁగూడ ధర్మ శబ్దమునకు గూడ తాత్పర్యమును మనము ఆలోచించవలెను. ధర్మము (Law) అనగా పౌనఃపున్యముగ కార్యములు జరిగెడు ధోరణి. ఒకపని జరిగినతరువాత నిఁకొకపని జరుగుటగాని యొకదానితోకూడ నింకొకటి జరుగుటగాని మనము చూచినప్పుడు మన మవి యెప్పుడు జరిగినను ఆప్రకారమే జరుగునని యెంచుదుము. దీనిని శాస్త్రజ్ఞులు వ్యాప్తియని వాడుదురు. మనశాస్త్రాభిప్రాయములన్నియు సమావేశము వలనఁ గలిగినవని వారియాశయము. కొన్నిపనులు జరుగుటవలన నవి మనమనస్సునందున్న యూహాలతో నొకవిధమయిన నీమముగా కలసి దానివలన మనమేదిచూచిన దానికి మనస్సునందలి ఇతర విషయములతో సమా

వేశము తటస్థించును. మనమనోశాస్త్రప్రకారము చిత్తమందొక తరంగము బయలుదేరినఁ దానింబట్టి యనేక తరంగము లుత్పత్తియగును. సమావేశమనగా? శాస్త్రీయమయిన యభిప్రాయమిది. ఇందికర్మసూత్ర మొకభాగము.విస్తృతమయిన యీసమావేశమునకే వ్యాప్తియని పేరు. ధర్మశబ్దమునకుఁ బాహ్యప్రపంచమునందుఁగూడ అంతః ప్రపంచమునందున్న యర్థమే చెల్లుచున్నది. ఒక కారణమువలన నొక కార్యము గలుగుటను బట్టి యట్లేయెప్పుడును మరల మరల జరుగునని యెంచుట వాస్తవముచేత ధర్మము ప్రకృతి యందులేదు. ఆకర్షణ భూమియందున్నదనిగాని లేక యట్టిధర్మము వస్తురూపముగా నెక్కడనైన నున్నదనిగాని తలంచుటతప్పు. ధర్మమనగా మనయెదుట జరిగెడు కార్యములను మనస్సునకు బోధపడెడు పద్ధతి. అదియంతయు మనసునందున్నది. కొన్నిపనులనుబట్టి కొన్నిపనులు జరుగుటను జూచి యవియెప్పుడును క్రమముగా ఆప్రకారమే జరుగునని నమ్మకము గలిగి దానింబట్టి యట్టి కార్యములన్నియు నేపద్ధతిప్రకారము జరుగునో మనము గ్రహించ గలుగుట ధర్మమగుచున్నది.

తరువాత నాలోచనీయమయిన విషయమట్టి ధర్మము సార్వత్రికమనగా నేమి? యనునది విశ్వమనగా సృష్టియందు దేశకాల నిమిత్తములను నామముతో శాస్త్రజ్ఞులచే వ్యవహరింపఁబడుభాగము. ఈవిశ్వమనంతమైన సృష్టియందు దేశకాల నిమిత్తములచే నొకరూపముగా నేర్పడిన యొకభాగమై యున్నది. కాఁబట్టి యీధర్మమనునది దేశకాల నిమిత్త విశిష్టమయిన విశ్వమునకే వర్తించును. దానికిఁదరువాత ఏధర్మము నుండనేరదు. విశ్వమనగా మనకు మనోగోచరమైన భాగము మాత్రమే. త్వక్చక్షుశ్శ్రోత్ర బుద్ధీంద్రియములకు గోచరమగు విశ్వము మాత్రమే యీధర్మమునకు లోఁబడియున్నది. వీని కతీతమయిన సృష్టి

యీధర్మమునకు బద్ధమై యుండలేదు. ఏమన? మనస్సునకు దాటి నిమిత్తము వ్యాప్తముకాజాలదు. అక్కడ మనస్సు లేనందున మనస్సుతో సమావేశమగుటయుండదు. సత్వదార్థము నామరూప విశిష్టమైనప్పుడే కర్మసూత్రమునకుఁ బద్ధమైయుండును. కాఁబట్టి దీనినిబట్టి స్వతంత్రచిత్తమనునది యుండదని కనఁబడుచున్నది. ఈరెండుపదములును పరస్పర విరుద్ధములుగా నున్నవి. చిత్తమనగా మనకుఁ దెలిసినది. మనకుఁ దెలిసినదెల్ల విశ్వములోనిది. విశ్వములోనిదెల్ల దేశకాల నిమిత్తబద్ధమైనది. మనకు తెలిసినదియుఁ దెలియదగినదియు నిమిత్తబద్ధమైనది. అట్లుబద్ధమైనది స్వతంత్రమైనదిగానుండఁజాలదు. దానికితరకారణములతో సంపర్కము కలిగియుది మరల కారణమగుచున్నది. కాని మొదటి చిత్తము లేక యిచ్ఛయైయుండక తరువాత యిచ్ఛగామార్చబడి దేశకాల నిమిత్తములలోఁ జిక్కిన వస్తువు ప్రథమమున స్వతంత్రమైనదిగానుండును. అదిమరల నీదేశకాల నిమిత్తములనుండి తప్పించుకొనిబయటపడినప్పుడు మరల స్వతంత్రమును బొందును. అది మొదటస్వతంత్రమునుండి పుట్టును. పిమ్మట నీబంధములలోఁ జిక్కుకొనును. కడపట వీనిదప్పించుకొని మరల స్వతంత్రమును బొందును. ఈవిశ్వమెవరినుండి పుట్టును? యెవరియందుఁడును? ఎవరికడకుబోవును? అను తర్కము తరుచు వచ్చుచుండును. ఇందుకుసమాధానము ముక్తినుండి పుట్టును. బంధమందుండును. మరల ముక్తిలోనికి బోవును. అని చెప్పబడియెను. కాఁబట్టి మనుష్యుఁడు అనంతమూర్తియైన భగవంతుని స్వరూపమేయని మనము చెప్పునప్పుడు దానికర్థ మాతని యందొక యల్పాంశమనుట. ఈశరీరమును, మనస్సును, ఆ పూర్ణపరమాత్మునియొక్క యొకయంశము. ఈవిశ్వమంతయు వానియంశమే. మనధర్మములు, బంధములు, సంతోష విషాదములు, మనసౌఖ్యము, మనయాశలు నివియన్నియు నీ

చిన్న విశ్వమునందలివి. మన హానివృద్ధు లీయల్ప ప్రదేశమునందుమాత్రము కలుగుచున్నవి. కాఁబట్టి మన మనస్సుచేఁ గల్పింపఁబడిన యీవిశ్వము నిరంతరాయముగాఁ జరుగునని తలంచుటయు, మన మెఱిగిన యీలోకమువంటి దేయగు, స్వర్గమున కేఁగఁగోరుటయు, చిన్నతనమును దెలియఁజేయును. అనంతమయిన యునికినంతను, మనకు మనోగోచరమై, యవధిబద్ధమయిన యల్పవిశ్వమున నిముడ్పఁగోరుట యసంభవమును వెఱ్ఱికోరికయునై యున్నది. మనుష్యుఁడెప్పటికిని సృష్టిదే కావలయునని కోరుకొనుట అనగా సుఖమైన మతమును గోరుట కర్మమేమనగా నాతఁడు దీనికంటె నుత్తమమైన పదవినెఱుంగనంతటి క్షీణదశకు వచ్చెననుట. అతఁడీ ప్రస్తుతపరిసరము లేగాని మఱియేమియును గాదు. అతఁడు తనయనంత స్వభావమును మఱచినాఁడు. అతని యూహాలన్నియు నీతాత్కాలికాల్పసుఖదుఃఖములయందును ఈర్ష్యాసూయాదులందును మగ్నమగునది. అతఁడీ పరిమితమైన యీవస్తువునే యపరిమితమైనదానిగా భ్రమించుచున్నాఁడు. అంతేకాక యీమూర్ఖత నాతఁడు విడువనొల్లఁడు. అందుచే నాతఁడీసంసారమునందలి తృష్ణలో నిరాశఁజిక్కుకొనుచున్నాఁడు. ఎన్నిలక్షల విధములయిన సౌఖ్యములు, జీవరాసులు, ధర్మములు, వృద్ధినిమిత్తములునున్నను, అన్నియు మనకు దెలిసిన యీవిశ్వమందు పనిచేసెడి యివియన్నియు మన యనంతస్వభావముయొక్క యొకభాగము మాత్రమగుచున్నది.

స్వాతంత్రియమును సంపాదించుటకు మన మీవిశ్వముయొక్క హద్దులను మీరి పోవలసియున్నది. అది యిక్కడననిపించదు. పరిపూర్ణమయిన ముక్తి యనగా క్రైస్తవులనెడు మనస్సునకు దురూహ్యమైన నిశ్చలమనశ్శాంతి యీవిశ్వమునఁగాని, స్వర్గమునఁగాని మన యింద్రియమనోగోచరమైన మఱియెచ్చోటఁగాని కలుగనేరదు. అట్టి

ప్రదేశములన్నియుఁ దేశకాలనిమిత్తబద్ధములై యుండుటచే మనకు ముక్తిని లేక స్వాతంత్ర్యమునీయఁజాలవు. మన భూలోకమునకంటె సూక్ష్మమయిన లోకములుండవచ్చును. అక్కడనింతకంటెఁ గాఢమయిన సుఖములుండవచ్చును. గాని యవియును, పరిమితములయినవగుటచే ముక్తిప్రదములుకావు. కాఁబట్టి వీనినిదాటి పోవలెను. అప్పుడే నిక్కమయిన మతము ప్రారంభమగును. ఈయల్ప సుఖదుఃఖములును వస్తుజ్ఞానము నక్కడతోనంతమగును. అప్పుడు సత్యముప్రారంభమగును. మనకీ జీవనమందలి తృష్ణయు, నశ్వరమైన యీయాయువునకీయందనురాగమును నశించువరకు వీనికతీతమైన మోక్షముయొక్క లీలలైనఁ గనఁబడదు. ఈజీవనమును, ఈలోకమును, ఈస్వర్గమును, ఈశరీరమును, ఈమనస్సును, అవస్థావిశిష్టమైన ప్రతిదానిని విడిచిపెట్టుటయొక్కటియే మనుష్యునికిఁగల కోరికలన్నింటిలోనికి, నుత్తమమయిన మోక్షమును సాధించుటకు మార్గమనుట సహేతుకముగానున్నది. ఈవిషయప్రపంచమునందలి మోహమును మనము విడిచిపెట్టితిమా మనము వెంటనే ముక్తులమగుదుము. కార్యకారణరూపమయిన కర్మ సూత్రమును దప్పించుకొనుటయే బంధమోక్షమునకు సాధనము. ఈలోకమునందలి, యనురాగమును విడిచిపెట్టుట మిక్కిలి కష్టము. దానిసాధించిన వారెవ్వరును లేరు. దానికి మనగ్రంథములలో రెండు సాధనము లుపపాదింపఁబడి యున్నవి. అందొకటి "నేతి నేతి" యనునది. రెండవది "ఇతి" యనునది. మొదటిది నిర్గుణమార్గము. రెండవది సగుణమార్గము. నిర్గుణమార్గ మతి ప్రయాసకరము. అది నాకీప్రపంచమక్కరలేదని ఘంటాపథముగఁ జెప్పగలిగిన జితేంద్రియులగు మహానుభావులకుఁగాని సాధ్యముకానిది. అట్టివారెక్కడనోగాని లేరు. కాఁబట్టి లోకమునఁ జనసామాన్యులందరును, సగుణమార్గమునే యవలంబించి లో

కమందుండి దానిబంధములను ద్రెంపివేయుటకై యాబంధములనే వినియోగించి పాటుపడుచున్నారు. ఇదియు నొకరీతి వైరాగ్యమే. దానివలన. వస్తుతత్త్వమును దెలిసికొని లోకమందలి వస్తువులను భోగించి యనుభవమును సంపాదించి చివరకు క్రమముగా, మనస్సునకు వానియందు విరాగము గలిగి, వానినిద్యజించును. మొదటి మార్గమున తర్కమున వైరాగ్యము కలుగును. రెండవ దానివలన కర్మవలనను అనుభవమువలనను, వైరాగ్యముకలుగును. మొదటిది జ్ఞానయోగమార్గము. దానికి నివృత్తి లక్షణము. రెండవది కర్మయోగమార్గము. అందు నివృత్తి లేదు. ప్రతివాఁడును కర్మనాచరించవలెను. ఆత్మతృప్తులై ఆత్మను మీఱిన కోరికలు లేక యాత్మయందే మనస్సులగ్నమై సర్వము నాత్మగాగలవాడు మాత్రము కర్మనాచరింపరు. తక్కినవారు కర్మనాచరించుటవిధి. స్వభావసిద్ధముగా ప్రవహించెడు ప్రవాహము పల్లములోఁబడి సుడిగుండమై తరువాత కొంతదూరము ప్రవహించి మరల స్వేచ్ఛగా ప్రవాహమై నిరంకుశముగా బోవును. ప్రతిమనుష్యుని జీవనము నట్టిప్రవాహమువంటిది. అదిలోకమను సుడిగుండమునఁబడి దేశకాల నిమిత్తములందుఁ జిక్కువడి నాతల్లి, నాతండ్రి, నాయన్న, నాపేరు, నాకీర్తి, యని ద్రొల్లి చిట్టచివరకు వానినుండి బయలబడి తొల్లింటి ముక్తినిబొందును, లోకమంతయు నిట్లుచేయుచున్నది, మనముదానినెరిగినను, ఎఱుగకున్నను, మనకది తెలిసియున్నను, తెలియకయున్నను, మనమందరము లోకమను స్వప్నమునుండి బయటబడుటకు పనిచేయుచున్నాము. మనుష్యుని యనుభవమునకు, ప్రయోజనము, సుడిగుండమును దాటి బయలుబడుటయే.

కర్మయోగమననేమి? కర్మరహస్యమును దెలిసికొనుట, విశ్వమంతయును పనిచేయుచుండుట మనము చూచుచున్నాము. ఎందు

కొఱకు? ముక్తికొఱకు. అణువు మొదలు, బ్రహ్మాండము వఱకన్నియు మనస్సు, శరీరము, ఆత్మ, వీనియొక్క మోక్షముకొఱకు, పని చేయుచున్నవి. అన్నియును బంధమును బాసి మోక్షము నపేక్షించి పనిచేయుచున్నవి. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, భూమి, గ్రహములు, నన్నియు బంధమును దప్పించుకొని స్వేచ్ఛ సంపాదించుకొనుటకుఁ జూచుచున్నవి. ఆకర్షణ, వికర్షణ శక్తులు రెండును, విశ్వమునకు మంచి యుదాహరణములుగానున్నవి. వస్తుతత్త్వమును దెలుసుకొనుటకు చిరకాలము విశ్వములో బడి కొట్టుకొన నక్కఱలేకుండ కర్మయోగమువలన కర్మరహస్యమును కర్మనాచరించు మార్గమును దెలుసుకొనుచున్నాము. శక్తిని వినియోగించుటెట్లో తెలియనేరని యెడల నెంత గొప్పశక్తియైనను వ్యర్థపుచ్చుదుము. కర్మయోగము కర్మ నొక శాస్త్రముగాఁ జేయుచున్నది. దానివలన కర్మల నెట్లుత్తమమయిన యుపయోగములోనికి దేవచ్చునో తెలియఁగలము. కర్మ యవిలంఘ్యము. అది యట్లు జరగవలెను. కాని యుత్తమములయిన ప్రయోజనములకై దాని నాచరించవలెను. కర్మయోగము, ఈప్రపంచము, క్షణభంగురమని మనచేత నొప్పించుచున్నది. దానిని మనము దాటిపోవలెను. ముక్తి దీనియందు లేదు. దీనికావలనున్నది. బంధమోక్షముకొఱకు మనము దీనిని క్రమముగాను మెల్లగాను నిర్గమించవలెను. సర్పముకు బుసమును విడిచినట్లు ఈలోకమునుద్యజించి దానితో సంబంధము లేకుండ నిలుచు పరమ విరాగులును అక్కడక్కడ కొందరుగలరు, అట్టివారు గాక, తక్కిన వారందరును, ఈకర్మప్రపంచములో నుండియే పోవలెను. కర్మయోగము, దానిమార్గమును, పద్ధతిని, రహస్యమును, దానినుండియోగములోనికి దెచ్చుమార్గమును బోధించును.

ఆది యేమిచెప్పుచున్నది? “నిత్యమును కర్మ నాచరించుచు దాని యందు సంగమును విడిచిపెట్టవలెను. దేనితోడను ఐక్యమును పొందకుము. నీమనస్సును, స్వాతంత్రముగా నుంచుకొనుము. మనముచూచుచున్న, సుఖ దుఃఖాది ద్వంద్వములన్నియును లోకమునకు సహజములు. దారిద్ర్యము, భాగ్యము, సుఖము, మొదలగునవి క్షణభంగురములు. అవి మన నిజమైన స్వభావమునకుఁ జెందినవికావు. మనస్వభావము సుఖ దుఃఖాదులకును, ఇంద్రియ విషయములకును అతీతమై, దురూహ్యమైనది. అయినను, మనము సర్వదా కర్మను చేయుచునే యుండవలెను. దుఃఖము సంగమువలన వచ్చును గాని కర్మవలన గలుగదు. మనము చేసెడుపనితో మనమెప్పు డేకీభావమును బొందుదుమో యప్పుడు దుఃఖమునకు లోనగుచున్నాము. అట్లు కానియెడల మనకు దుఃఖము కలుగనేరదు. ఒక యందమయిన బొమ్మ మఱియొకరిది తెచ్చి తగులబెట్టినయెడల మనుష్యుఁడు విచారమును పొందడు కాని తన బొమ్మను తగులబెట్టినయెడల మితిలేని విచారమును పొందును. ఎందుచేత? రెండును అందమయిన బొమ్మలే. ఒక దానికొకటి ప్రతిరూపములు గూడనై యుండును కాని యొక దానివిషయమై యెంతో దుఃఖము కలిగినది. ఎందుచేత? దానితో నేకీభావమును పొందుటవలన. “ నేను నాది” అను నీరెండే దుఃఖ కారణములు. నాది యనున దేర్పడినతోడనే స్వార్థ పరత్వము వచ్చుచున్నది. దానితో దుఃఖము కలుగుచున్నది. స్వార్థపరమయిన, ప్రతికార్యమువలనను ఆలోచనమువలనను మనకు బంధము కలుగుచున్నది. తోడనే మనము దాసులమగుచున్నాము. చిత్తమునందుఁ బయలుదేరెడు, నేను నాది యను ప్రతితరంగమును మనలను, గొలుసులతోఁ గట్టి బంధించుచున్నది. నేను నాది యను నభిప్రాయ మెంత బలపడిన నంతగా మనము బద్ధులమై మన దుఃఖమంత

గా నతిశయించుచున్నది. కాఁబట్టి కర్మయోగము లోకమంతయున్న, బొమ్మలన్నిటియొక్క సౌందర్యమును మనకనుభవమగునట్లు, చేయునుగాని, దేనియందును మనకు మమకారమును గలుగనీయదు. "నాది" యని యెన్నడు ననరాదు. ఎప్పుడు మనము "నాది" యని యొకవస్తువునను కొనుచున్నామో, దానితో దుఃఖము కలుగుచున్నది. నీమనస్సులో నీ బిడ్డనైనను నాది యని యనుకొనరాదు. బిడ్డలను గలిగి యుండవలసిన దేగాని నాది యని యనుకొనరాదు. అనుకొంటివా దుఃఖముకలుగును. నాయిల్లు, నాశరీరము నని యనవలదు. ఉన్నకష్టమంతయు, నిక్కడనే యున్నది. శరీరము నీదికాదు నాదికాదు ఎవరిదికాదు. ఈశరీరములు ప్రకృతి స్వభావమును బట్టి వచ్చుచున్నవి, పోవుచున్నవి. మనము సాక్షిభూతులమై పైనుండి చూచుచున్నాము. ఈశరీరము బొమ్మకంటెను గోడకంటెను నెక్కువ స్వాతంత్ర్యమును గలది కాదు.మనమట్టి శరీరమున కంతగా నేలయంటిపెట్టుకొనవలెను? ఎవరయిన బొమ్మ వ్రాసిన వ్రాసిపోవును. అదినాకుండవలెను. అను స్వార్థపరత్వమును మాత్రము కలిగి యుండరాదు. అది యెప్పుడు కలిగినదో, దానితో దుఃఖము ప్రారంభమగును.

కాఁబట్టి కర్మయోగము ఈస్వార్థ పరత్వమును నశింపఁజేసికొనుమనియు దానినడచుకొన శక్తి కలిగినతోడనే మరల దాని రానీయకు మనియుఁజెప్పుచున్నది. అప్పుడు లోకములో ప్రవేశించి యెంత పనియైనఁజేయవచ్చును. ఎవరితో గలిసినను, ఎక్కడకుబోయినను నీకు పాపమంటదు. నీటియందు తామరాకుగలదు. నీరు దాని నంటదు. నీవును లోకములో నట్లేయుండుము. ఇదివైరాగ్యము వైరాగ్యములేనిదే. యోగముండనేరదు. అన్ని యోగములకు విరాగము మూలాధారము. ఇంటిలోనుండుట, శుభ్రవస్త్రములను ధరించుట, మంచియాహారమును

డినట్టు, మానివేసి యడవుల లోనికి బోయినవాఁడును, మిక్కిలి సక్తుడైనవాఁడుగానుండవచ్చును. వానికి మిగిలియున్న శరీరమే వానికి సర్వస్వమునై యుండవచ్చును. అతఁడు జీవించియుండి శరీరము కొఱకు, నానాపాట్లును బడుచుండును. నిస్సంగమనగా, బాహ్యమయినదికాదు మనస్సునందుండవలెను. « నేను, నాది, యనువానిని దెచ్చిపెట్టినది. మనసునందున్నది. శరీరముతోడను, విషయములతోడను, అట్టి బంధములేకుండఁ జేసికొంటిమేని, మనమెక్కడ నున్నను, నిస్సంగులమే. సింహాసనాసీనుండయి యుండియు నిస్సంగుఁడుగా నుండవచ్చును. మఱియొకఁడు చినిగిన గుడ్డలనుగట్టుచుండియు సంగయుతుఁడుగానుండవచ్చును. మొదట వైరాగ్యమును సంపాదించుకొని తరువాత కర్మనాచరించవలెను. కర్మయోగము వైరాగ్యమును సంపాదించు మార్గమును బోధించును. అదిమిగుల కష్టముమాత్రమగును.

వైరాగ్యమునకుఁగల రెండుమార్గములు నిచ్చట కలవు. అందొకటి భగవంతునిఁగాని బాహ్యమయిన యేసహాయమునుగాని నమ్మని వారికి వారువారిచిత్తము వచ్చిన యుపాయములను బన్నుకొనవచ్చును. వారు వారిచిత్తవృత్తిననుసరించి నాకువైరాగ్యము కావలయునని చెప్పుచు వారి మనశ్శక్తిని, వివేకమును అనుసరించి పనిచేయవలెను. భగవంతుని నమ్మెడువారి కంతకంటె సుకరమయిన మార్గము కలదు. వారు తమ కర్మఫలములను భగవదర్పణము చేయుదురు. వారు పని చేసియు దానిఫలమందు సక్తత గలిగియుండరు. వారు దేనిని చూచినను వినినను చేసినను భగవంతుని కొఱకే. మనమేసత్కార్యమును చేసినను దానివలనగలుగు స్తోత్రమునుగాని లాభమునుగాని మన మపేక్షించరాదు. అవిభగవంతునివి. ఫలమునుభగవదర్పణము చేయవలెను. మనమొకప్రక్కను నిలిచి మనము దేవుని సేవకులమనియు, మనకు

కర్మచేయు ప్రోత్సాహ మతనివలననే కలుగుచున్నదనియు దలంచ వలెను. ఏపూజచేసినను ఏమిచూచినను ఏమిచేసినను అన్నియు దేవుని కర్పించి విశ్రాంతితో నుండవలయును. మనము శాంతులమై పూర్ణము యిన సుఖము ననుభవించుచు మనశరీరము మనస్సు నన్నియు నీశ్వరు న కర్పించవలెను. అగ్నియందనేక ద్రవ్యములను హోమము చేయుట కు మారుగా రాత్రింబవళ్లు స్వార్థపరత్వమును హోమముచేయుచుం డ వలయును. "భాగ్యము కొఱకు వెదుకగా నీవేనాకు గనబడిన స మస్త భాగ్యమవునై యున్నావు. నేను నీకుఁబలియగుచున్నాను. ప్రేమ కొఱకై శోధింపగా నీవేప్రేమైక నిదానమువుగా నాకు గనపడినావు. నేనునీకుఁబలియగుచున్నాను." అని యిదియనుదినము ననుసరించుచు "నా కొఱకేదియును గాదు. మంచిదైనను చెడ్డదైనను ఏదియు నాకక్కఱ లేదు. అన్నియు నీకే యర్పించుచున్నాను" అని చెప్పవలెను. ఈప్రకా రము నిత్యమును మమకారమును నశింపజేసుకొనుటకై ప్రయత్నించి వైరాగ్యము పూర్ణముగా కుదిరెను వఱకును పూనికతోపనిచేసి యట్టి వైరాగ్యము మనశరీరమంతట వ్యాప్తమగునట్లు చేసుకొనవలెను. మన శరీరము సర్వదా దీనికి విధేయమై యుండవలెను. అప్పుడు యుద్ధరంగము నకుఁబోయి ఫిరంగుల నడుమనున్నను నీకు మనశ్శాంతి గలిగి స్వేచ్ఛగా నుందువు.

ధర్మము (duty) యొక్క సామాన్యమయిన యభిప్రాయము క్రిందితరగతులలోనిదని కర్మయోగము తెలియచేయుచున్నది. అయినను మనమందరమును ధర్మముల నాచరించి తీరవలెను. కాని యీధర్మ ము (duty) చేయవలెనను జ్ఞానము తరుచు దుఃఖకారణ మగుచున్నది. ధర్మమనునది మనకొక వ్యాధివంటి దగుచున్నది. మనలను సర్వ దా ముందుకీడ్చుకొని పోవుచున్నది. అది మనలను బట్టుకొని మన జీవి

తమంతయు దుఃఖపూరితముగా జేయుచున్నది. అది మనుష్య జీవితము నకంతకును ముప్పయినది. ఇది మధ్యాహ్నపు టెండవలె నాత్మను మాడ్చివేయుచున్నది. అధర్మమునబడి యున్నవారిని జూడుడు. వారికి స్నానము చేయుటకు తీరిక లేదు. దేవుని ప్రార్థించుకొనుట కవకాశము లేదు. ఎప్పుడును వారికి ధర్మముపైనఁబడి యుండును. వారు సదా పని చేయుచుందురు. ఇంటికివచ్చి మరల రేపు చేయవలసిన పనిని జూచుచుం దురు. అది బానిసవాని జీవనమువలె నున్నది. పనిచేయుచు చేయు చునే వీథులలోనో చనిపోవుదురు. ధర్మమనగా, నిట్టిదిగాఁదలం చు చున్నారు. సత్యమైన ధర్మమేది యనగా, వైరాగ్య యుక్తులయి స్వేచ్ఛతోనుండి యన్నిపనులును, భగవదర్పణముచేయుట. మనవిధుల న్నియు నాతనివే. మనకిక్కడ పనిచేయుట కాజ్ఞ అయినది ధన్యులమే మనము చేయవలసినంత కాలము చేయుదుము. అది బాగైనను ఓగైన ను, ఎవరికిగావలెను. బాగైనను ఫలము మనకక్కఱలేదు. ఓగైనను మనకక్కఱలేదు. శాంతులమై ముక్తులమయి పనిచేయవలయును. ఇట్టి ముక్తి కలుగుట బహుదుష్కరము. బానిసవలె పాటు పడుటను, ధర్మమని యెంచుట, చాలసుకరము. శరీరము కొఱకు పడుపాట్లు ధర్మ ములగునా? మనుష్యులు లోకములోఁబడి, వారికిఁగావలసిన ధనముకొ ఱకో, దేనికొఱకో, పాటుపడుచు, వారినడిగిన నిదియేధర్మమని యుం దురు. అది ధనలాభములయందు విరుద్ధమైన యాశ, దానిని కొన్ని పు ష్పములతో గప్పిపెట్టి బహియత్నించుదురు. ధర్మమనగానేమి? అది మ నకున్న రాగముయొక్క (ప్రోత్సాహము) రాగము ధృఢపడినప్పుడు దానిని ధర్మమందుము. ఇందుకుదాహరణము, పెండ్లిలేని దేశములలో భార్యభర్తలకు ధర్మములులేవు. పెండ్లికాగానే భార్యభర్తలకుండు రా గమును బట్టి వారుగలిసి వసింతురు. అదికొన్ని తరములకు స్థిరముయ్యి

యాచారమగును. అట్లు స్థిరపడినతరువాత నది ధర్మమగును. అదియొక చిరకాలవ్యాధివంటిది. అది యెక్కువగానున్నప్పుడు, వ్యాధియందుము. చిరకాలాగతమయినప్పుడు స్వభావమందుము. అది యొకవ్యాధి. రాగము, చిరకాలాగతమయినపుడు దానికి ధర్మమని పెద్ద పేరుపెట్టి ఘనత నావహింపచేయుదుము. దానిమీద పూవులు చల్లి, వాద్యములను మోగించి ధర్మశాస్త్రములను జదువుదుము. దానికై లోకమంతయు పోరాడుదుము. పశుత్వము నడచునంతవఱకు ధర్మముమంచిదే. ఏదియుఁ దెలియని హీనతరగతులలో వారికది కొంత మేలైనదే? కర్మయోగులుగా నుండఁగోరువారుమాత్ర మట్టి ధర్మమును విడువవలసినవారే. నీకును నాకును విధియను నదేదియు లేదు. నీవు లోకమున కీయవలసినదేమో, యీయవలసినదే గాని, యదియొకవిధి యనికాదు. ఆవిషయమయిన యోచనయే కూడదు. బలవంతముకూడదు. బలవంతముగాఁ జేయునదెల్ల బంధకారణమగును. మనకు విధి యేలయుండవలయును? అన్నియు భగవదర్పణచేయుము. విధియను గుండమునఁబడి శరీరము దహించుక పోవుచున్నప్పుడే యమృతమును సేవించి సుఖమును పొందుము మనము భగవంతుని యాజ్ఞను నెఱవేర్చుచున్నాము. దాని ఫలములతో మనకు పనిలేదు. పుణ్యఫలమెప్పుడు కావలయునో అప్పుడే పాపమును గూడ ననుభవించవలెను. పాపశిక్షను దప్పించుకొనుటకుపాయము పుణ్యఫలమును గూడ విడుచుటయే. సుఖమును విడిచిపెట్టుటయే దుఃఖమును బోగొట్టుకొనుటకు సాధనము. వానిరెంటికినవినాభావసంబంధము. ఒకవైపున దుఃఖము, రెండవవైపున సుఖము. ఒకవైపున మృతి, రెండవవైపున జీవనము. మృతిని దప్పించుకొనవలయుననిన, జీవనప్రేమను విడుచుటయే సాధనము. మృతియన్నను జీవనమన్నను వస్తుతః ఒక్కటే వానిని వీక్షించుటలో నున్నది. కాఁబట్టి దుఃఖ

ము లేని సుఖమును, మరణములేని జీవనమును, వట్టి భ్రమలు. జ్ఞానులు అవిరెండును మాటలలో భేదములేగాని యంతకంటె లేదనియెంచి రెండును విడిచిపెట్టుదురు. నీవుచేయుదానికి స్తుతినిగాని బహుమానము గాని కోరరాదు. సత్కార్యముచేయగానే, దానికి ఫలమును గోరుదుము. మనము దానము చేయగానే దానిని వార్తాపత్రికలలో నుద్ఘోషింపఁగోరుదుము. అట్టి కోరికలవలన దుఃఖముకలుగును. లోకములోని గొప్పవారందరు, నెవరికిని దెలియకుండనే గతించినారు. బుద్ధుఁడు, క్రీస్తు మొదలగువారట్టి మహాపురుషులకుదరువాతవారే. ప్రతిదేశమునందు ననేక వందలమంది యాడంబరముగా పనిచేయువారుందురు. వారుచల్లగా బ్రతికి చల్లగాగతించెదరు. కొంతకాలమునకు, వారి యూహాలు, బుద్ధుడు, క్రీస్తు, మొదలగు వారిలో వ్యక్తమగును. వీరు మనకుఁ దెలియవత్తురు. అత్యుత్తములయిన వారు పేరు ప్రఖ్యాతులనెన్నఁడు నపేక్షింపరు. వారు వారియభిప్రాయములనులోకములో విడిచిపెట్టుదురు. వారుతమపేర పాఠశాలలు మొదలగునవి నిర్మించి, దేనికిని కర్తృత్వమును దమమీఁద బెట్టుకొనరు. అట్టిది వారి స్వభావములకు వెగటుగానుండును. వారు కేవల సాత్వికులు. పూర్ణమైన ప్రేమతో నిండియుండుటయేగాని, వారేమియు చలింపరు. అట్టి యోగీశ్వరునొకరిని హిందూదేశమున నొక గుహలో జూచియున్నాను. అతఁడత్యద్భుతమయిన పురుషుఁడు. అతనియందు అహంకార మమకారములు సంపూర్ణముగా నశించినవగుటనాతనియందు మనుష్యత్వము లేదని చెప్పవలెను. అతఁడు సర్వవ్యాప్తమయిన దివ్యజ్ఞానమూర్తియైయుండెను. ఏదైన నొకజంతువొక భుజమును గరచిన రెండవభుజమును గూడ నిచ్చుటకుసిద్ధమయి యది భగవదిచ్ఛ యని చెప్పును. ఏదివచ్చినను అతఁడు తనమహిమను ప్రజలకుఁ గనపరచఁడు. గాని యతఁడు ప్రేమైకమూర్తియై యున్నాఁడు.

తరువాత రాజసగుణులయిన పురుషులు బయలుదేరి పూర్ణులైన వారి యభిప్రాయములను లోకమునకుఁ బోధించుదురు. అత్యుత్తముల యిన మహాపురుషులు నెమ్మదిగా సత్యమయిన మహదభిప్రాయములు ను సంగ్రహించుదురు. వానిని బుద్ధుఁడు, క్రీస్తు, మొదలగువారు దేశ దేశమున వ్యాపింపఁజేయుదురు. గౌతమబుద్ధుని జీవితమును బట్టి యీ తఁడిరువది యైదవ బుద్ధుఁడని మనము తెలిసికొనుచున్నాము. మొదటి యిరువది నలువురను,మనమెఱుంగము. చరిత్రకుఁ దెలిసిన బుద్ధుఁడు వా రియూహలనే ప్రచురించి యుండవచ్చును. అత్యుత్తములయిన పురుషు లు శాంతులై యణగి యుండి యెవరికిని దెలియరాకుందురు. వారే యూహాశక్తి సత్యముగాఁ దెలిసికొన్నవారు. వారేగుహాలోనికైనఁ బోయి తలుపు మూసికొనియైనను గొన్ని యూహల నూహించిన యెడ ల నవి శాశ్వతముగా నుండునని వారికిఁ ధృవముగా దెలియును. నిశ్చ యముగా నట్టియూహలు, కొండలు, సముద్రములు, దాటి లోకమంతట ప్రయాణము చేయగలవు. అవి మనుష్యుల హృదయములలోను, తలలో నను బ్రవేశించి వానిని ప్రచురింపజేయు వారిని మేల్కొలుపును. ఈసా త్వికులు భగవంతుని కతిసమీపమున నుండుటచే వారు ప్రవృత్తులయి వ్యాపకముచేయుటకై యీలోకములోని వివాదములకు కలహములకు దిగనొల్లరు. ప్రవృత్తులయిన వారెంత గొప్పవారైనను, వారికింకను అ విద్యా లవము కొంతయుండును. మనస్వభావమునకు గొంచమైన మా లిన్యమంటియున్నప్పుడుగాని, మనము పనిచేయనేరము. సామాన్యముగా నుద్దేశము, అనురాగము నుండినంగాని, కర్మనాచరించుటకుఁ బుద్ధిపుట్ట దు. పిచ్చుకల పాటునుగూడ కనిపెట్టి చూచు నీశ్వరుడుండగా మనుష్యు డు తనపనికేమి ప్రాముఖ్యత నీయఁగలఁడు.అత్యల్ప జంతువు విషయము నఁ గూడ భగవంతుఁడు దయామయుఁడై కాపాడుచున్నాఁడని మనమొ

జేఁగియున్నప్పుడు మనమేదో చేయుచున్నామనుట యుపచారముగాదో " నీచిత్తము చొప్పునఁ జరుగుఁగాక " యని భయభక్తులతో కేలుమోడ్చి నిలుచుటకంటె మనము చేయునది లేదు. అత్యుత్తములయినవారికి రాగము లేదుగనుక, వారు పనిచేయఁజాలరు. ఎవరి యాత్మ, యాత్మయందు లీయమై యెవరికోరిక లాత్మయందే యుండి, యెవరు సర్వదా యాత్మతో సాంగత్యమును గలిగి యుందురో వారికి కర్మ లేదు. అట్టివారు మానవకోటియందెల్ల నుత్తములు. వారుగాక తక్కినవారందరు కర్మనాచరించవలసినదే. అట్లు చేయుటలో మన మీలోకమున నొక యణువునకైన నుపకారము చేయగలమని తలంపరాదు. మనపనివలన మనకే యుపకారముగాని యితరులకుఁగాదు, ఈప్రకారము పనిచేసి యిట్లు పనిచేయుట కవకాశము గలుగుట, మనభాగ్యమని యెంచుచున్నయెడల మనకు ఫలాసక్తి యుండదు. అనేక వేలమంది నీవంటి వారును నావంటి వారును గొప్పవారమని యనుకొందురు. కాని యైదు నిమిషములలో మనము గతించుదుము, వెంటనే లోకము మనలను మఱచిపోవును. కాని దేవుని కునికి శాశ్వతము. సర్వశక్తుఁడైన యీశ్వరుని కిష్టము లేకున్న నెవరయిన నొకనిమిషము జీవింపఁగలరా? అతఁడు సర్వదా ప్రవృత్తుఁడయి లోకరక్షణమును జేయుచున్నాఁడు. శక్తి యంతయు నతనిది. అతని యాజ్ఞలోనున్నది. అతని యాజ్ఞచేఁ గాలివీచుచున్నది. సూర్యుఁడు వెలుగుచున్నాఁడు. భూమి తిరుగుచున్నది. మృత్యువు సంచరించుచున్నది. అన్నిటియందు నన్నియు నాతఁడే. అన్నియు నాతఁడు. అన్నిటియందున్నవాఁడాతఁడే. మనము జేయగలిగిన దాతని పూజించుట. కర్మ ఫలముల నన్నింటిని విడిచిపెట్టవలెను. నిష్కాములై సత్కర్మనాచరింపవలెను. అప్పుడు సంపూర్ణ వైరాగ్యము కలుగును. అప్పుడు మనహృదయ బంధములు దెగును, అప్పుడు మనకు పూర్ణమైన ముక్తి లభించును. ఈముక్తియే కర్మయోగముయొక్క గమ్యస్థానము.



# కర్మయోగము

## ఎనిమిదవ ప్రకరణము

### కర్మయోగముయొక్క లక్ష్యము.

### (The ideal of Karmayoga.)

భిన్నమార్గములనైన నొకే గమ్యస్థానమును జేరుదమనునది వేదాంత మతముయొక్క మహత్తరమయిన యభిప్రాయము. ఈమార్గములు నాలుగు-కర్మ, భక్తి, యోగము, జ్ఞానము. కాని యీమార్గములు కేవలము భిన్నమయిన వనియు,పరస్పర సంబంధములు లేవనియుఁ దలంపరాదు. వీనిలో నొక దానియందొకటి గర్భితమయి యున్నది. అందేది ప్రధానముగానుండునో, దానింబట్టి వాని కాయానామములు వాడఁబడుచున్నవి.కర్మ నాచరించుటకంటె భిన్నమయిన శక్తి లేశమును లేని పురుషుఁడు గాని భక్తియేగాని యితరమును దేనినాచరించ లేని పురుషుఁడు గాని, కేవల జ్ఞానమేగాని యితరమేదియు లేని పురుషుడు గాని లోకమున నుందురని చెప్పనలవికాదు. ఈవిభాగములాయాపురుషులందు విశేషముగా ప్రబలియున్న గుణమును బట్టియేర్పరుపఁబడినవి.రాను రాను ఈమార్గములు నాలుగును, సమీకరించి చివర కేకమగును. అన్ని మతములును అన్ని కర్మమార్గములును అన్ని విధములయిన సాధనములును మనల నొకే గమ్యపదమునకుఁ జేర్చును.

అగమ్యపదమేదియో నిరూపించుట కిదివరకే ప్రయత్నించి యున్నాను. అది మోక్షమని నాయభిప్రాయము. మనుచుట్టునున్న ప్రతివస్తువును. అణువు మొదలు మనుష్యునివఱకు, చైతన్యములేని నిర్జీవపదార్థరేణువు మొదలు ఉత్తమమయిన మానవాత్మవఱకిన్నియు మోక్షము నపేక్షించియే పాటుపడుచున్నవి. ఎక్కడఁజూచినను ప్రతి యణువును స్వేచ్ఛతో దనమార్గమున దానుబోవ బ్రయత్నించుచున్నది. ఇతర యణువులతో సంబంధమును దప్పించుకొన జూచుచున్నది కాని తక్కినవి దానిని బట్టుకొనుచున్నవి. భూమి సూర్యుని నుండియుఁ జంద్రుఁడు భూమినుండియు దొలగి పోవలెనని ప్రయత్నించుచున్నవి. ప్రతి వస్తువునకును విడిపోవు వాంఛగలదు. విశ్వమున మన కెక్కడఁ జూచినను ప్రతి దానికి నీమోక్ష స్పర్థయే మూలమయి కనపడుచున్నది. ఈ యపేక్షతోడనే ముని జపము చేయుచున్నాడు. ఈ యపేక్ష తోడనే దొంగ దొంగతనమును చేయుచున్నాడు. ఆప్రయత్నము చేయుమార్గము యుక్తము కానప్పుడు దానిని పాపమనియు, యుక్తమయి గొప్పదైనపుడు దానిని పుణ్యమనియు, చెప్పుచుందుము. కాని రెండింటికిని మూలకారణమయిన యుత్సాహము మాత్రమొక్కటే. మోక్షాపేక్ష మునికి తాను బంధమున నుంటినను జ్ఞానము వలన బాధకలిగి యాబంధమును తప్పించుకొన జూచును. కాబట్టి యాతఁడు భగవదారాధనమును జేయును. చోరుఁడు తన కేవో కొన్నివస్తువులు లేవని బాధ కలిగి యాలోపము నుండి విముక్తి నొందుటకుఁ దొంగతనమును జేయుచున్నాడు. ఈప్రకారము చైతన్యము కలిగినట్టియు, లేనట్టియు, సమస్త పదార్థములయందును మోక్షాపేక్ష స్వభావసిద్ధమై యున్నది. తెలిసియో, తెలియక యో యన్నియు మోక్షముకొఱకు ప్రయత్నించుచున్నవి. కాని ముని యపేక్షించెడు మోక్షము వేఱు. చోరుఁడు కాంక్షించు మోక్షము వేఱు.

మునివాంఛించిన మోక్షమనంతమయిన యనిర్వాచ్య సుఖమునిచ్చును, చోరుఁడు గోరెడు మోక్ష మాతని హృదయమునకు వఱికొన్ని బంధ ములను దగిలించును.

ప్రతి మతమునందును మోక్షము విషయమయిన ప్రయత్నము కనుపడుచుండును. సమస్తమయిన నీతికిని మనిష్యులు కేవలము శరీర మాత్రులు గారనుపహంకార శూన్యత్వమునకునుమూలాధార మీమో క్షాపేక్షయే. ఒకపురుషుఁడు సత్కార్యము చేయుచు పరోపకార మొన రించుచున్నప్పుడు వానిని మనము అహంకార మమకార గుణములలో వానిగా జేర్పరాదు. అహంకారమును బోగొట్టు కొనుటకు, మేర లేదు. నీతిశాస్త్రములన్నియు పరమమయిన యహంభావ శూన్యతను పర మావధిగా గణించు చున్నవి. అట్టి యహంకార రహితత్వము కుదిరినపి మ్మట, నేమగునందురా? వాని నింక తొల్లింటి పేరునఁ బిలువ వీఁలులే దు. అత డమితముగా వ్యాప్తమయిన వాఁడు. అతని పృథక్త్వము నాటి తోపోయినది. అతఁడనంతుఁడగును. అట్లగుటయే సర్వమతములకును సకలనీతి శాస్త్రములకును, సమస్త వేదాంత బోధనలకును, సారాంశము. జీవునకును దేవునకును, భేదమును పాటించు ద్వైతి, యీమాటలను వే దాంత పరిభాషలో విన్నప్పుడు ఘోరముగా దలంచినను, వీనినే య తఁడు నీతిరూపకముగాఁ బోధించును. ఆతఁడును స్వార్థత్యాగము నకు మేర నంగీకరించఁడు. వాని సిద్ధాంతప్రకారమొకఁడు పరిపూర్ణమైన స్వా ర్థత్యాగి యయ్యె నని యనుకొందుము- వానికి నితర సిద్ధాంతముల ప్ర కారమట్లయిన వానికిని భేదమేమి? అతఁడును విశ్వమయుఁడగును. విశ్వ మయుఁడగుటయే యన్నిమతములకును, గమ్యస్థానము సగుణవాదికి (Personalist) పూర్ణముగా చర్చించుటకు, ధైర్యము మాత్రము చాలదు. స్వార్థము గాని కర్మవలన మానవకోటికెల్ల నిధానమైన

మోక్షమును సంపాదించుటయే కర్మయోగము. స్వార్థపరమయిన కర్మ గమ్యపద ప్రయాణమును కష్టతరముగాఁ జేయును. స్వార్థ పరముగాని కర్మ దానిని సుకరముగాఁజేసి గమ్య పదమునకు మనల సమీపముగా గొనిపోవును. కాఁబట్టి నీతియనగా నిట్లు నిర్వచింప వలసియున్నది. "స్వార్థపరమయిన దెల్ల యవినీతి. అట్లు కానిది నీతి"

ఇంక వివరమునకుఁ దిగితిమా యీవిషయ మంత సులభముగా నుండునది కాదు. నేనిదివరలో చెప్పియున్న రీతిని పరిసరముల వలన, వివరములు భేదపడియుండును. ఒకే కార్యము కొన్ని సందర్భములలో స్వార్థ పరత్వముగాను, మఱికొన్ని సందర్భములలో నందుకు విరుద్ధముగాను నుండును. కాఁబట్టి సామాన్యమయిన నిర్వచనమును జెప్పి దానివివరములను, దేశకాల పాత్రములను బట్టి నిర్ణయింప విడువ వలయును. ఒకదేశమున నొకరీతి ప్రవర్తనము నీతిగా నెంచఁబడును. ఇంకొక దేశమున నదియే స్థితి గతులు వేఱగుటచేత దుర్నీతిగా నెంచబడును. ప్రకృతి కంతకును గమ్యస్థానము మోక్షము. అదిస్వార్థపరతను నశింపజేసుకొనుటవలన సిద్ధించును. ఆస్వార్థ పరమయిన ప్రతి యూహాయు మాటయు కార్యమును మనలను మోక్షమునకు సమీపముగాఁ గొనిపోవును. అందుచేత నది నీతిగా పరిగణింపఁబడుచున్నది. ఈనిర్వచన మన్ని మతములకును అన్ని నీతి శాస్త్రములకును పనికివచ్చును. కొందరిసిద్ధాంత ప్రకారము నీతి భగవంతుని నుండి పుట్టును. ఇట్లేలచేయవలెను? అట్లేల చేయరాదని యడిగిన వారు అది భగవంతునియాజ్ఞయని చెప్పుదురు. దేనినుండి కలిగినను వారినీతిశాస్త్రమునకు కూడ నిదానము స్వార్థమును త్యజించుట. ఇట్లయియుండియు కొందరు తమ పృథక్త్వమును విడిచిపెట్టుటయనిన భయపడుచున్నారు. అట్టివారిని మనమిట్లడుగవచ్చును. ఒకఁడు కేవలము పరార్థపరుఁడయి తానను నూహలేక తన కొఱకే

కార్యమును జేయక తనకొఱకేమియు పలుకక యుండువారికింకను పృథక్త్వ మెక్కడిదని యడుగవచ్చును. అట్టి నేనను భావము తనకొఱకు తాను జింతించుచు, మాటలాడుచు, నాపని చేయుచుంతవఱకే, అట్లుగాక విశ్వముకే చింతించుచు పరులనే దలంచుచుండువారికి నేనెక్కడ అది పోనే పోయినది.

కాబట్టి కర్మయోగము స్వార్థ పరత్వ రాహిత్యము వలనను సత్కార్యానుష్ఠానమువలనను మోక్షము సంపాదించెడు మార్గముగానున్నది. కర్మయోగి యేసిద్ధాంతమును నమ్మనక్కఱలేదు. అతఁడు భగవంతుని నమ్మనక్కఱలేదు. ఆత్మవిచారమక్కఱలేదు. ఏవేదాంత చర్చయు నక్కఱలేదు. అతనికి « అహంభావమును బోగొట్టుకొనుటయే గురి. అదిసాధించవలెను. అతఁడనుక్షణమును దాని సిద్ధికి బ్రయత్నించవలెను. అతనికే సిద్ధాంతముయొక్క సహాయమును లేక కేవలము, కర్మమున మోక్షమును సాధింపవలసియున్నది. దీనినే జ్ఞాని వివేకముచేతను భక్తుఁడు భక్తిచేతను సాధించుచున్నాఁడు.

తరువాత నీకర్మ యననేమి ? లోకోపకారమననేమి ? మనము లోకమున కుపకారము చేయఁగలమా ? వాస్తవము గాన నాధ్యాత్మికముగాఁ జూచినఁ జేయఁ జాలము. లౌకికముగాఁ జూచినఁ జేయుంగలము. లోకమునకు శాశ్వతమైన యుపకారమెన్నఁడును చేయఁజాలము. అట్లు చేయుటకు సాధ్యమయిన యెడల లోకమిట్లుండనే యుండదు. కొంతసేపటివఱకు మనుష్యుని యాకలి మనము శమింపఁ జేయఁగలము. కాని మరల నంతలోనే వాని యాకలి పుట్టును ఇట్లే మనము కలుగఁ జేయఁగలిగిన ప్రతిసుఖము నిట్లే క్షణభంగురముగా నుండును. ఈసుఖ దుఃఖములనెడు వ్యాధి మొదలంట గుదుర్చువారెవ్వరును లేరు. లోకమునకు శాశ్వతసుఖమెద్దియైన కలుగఁ జేయఁగలమా ? సముద్రములో

నొకచోట పల్లము పడకుండ నింకొకచోట తరంగమును లేవదీయఁజా లము. మనుష్యుని యొక్క యవసరమును బట్టియు ఆశను బట్టియు లోకముననున్న మొత్తపు సుఖమెప్పుడును సమానముగానేయుండును. అది యెక్కువ చేయుటకు గాని తక్కువ చేయుటకుఁ గాని వీలు లేదు. మనకిప్పటికి తెలిసినంత వఱకు మానవకోటి చరిత్రమును దీసికొందుము. ఒకేవిధముగా సుఖ దుఃఖములును సంతోష విషాదములును, అవస్థాభేదములును కనపడుచునే యున్నవిగదా? కొందరు భాగ్యవంతులుగాను కొందరు దరిద్రులుగాను, కొందరధికులుగాను, కొందరల్పులుగాను, కొందరారోగ్యవంతులుగాను, కొందరు రోగపీడితులుగా నుండుట లేదా? ఇది గ్రీకులలోను, ఈజిప్టియనులలోను, రోమనులలోను, పూర్వకాలమున, నిప్పటి యమెరికనులలో వలెనే యుండెను. చరిత్రకు దెలిసినంత వఱకొకే మాదిరిగా నున్నది. ఇట్లుండియు ననివార్యములయిన సుఖదుఃఖముల వెంబడించి పోవుచుండియు, వానిని శాంతింప జేసుకొనుటకు బ్రయత్నములును జరుగుచునే యున్నవి. ప్రతికాలమునందును, వేనవేలు స్త్రీపురుషులు బయలుదేరి తోడివారలకుఁ జీవయాత్ర సుకరముగ నొనరించుటకు బాటు పడుచున్నారు. వారెంతవఱకు కృతార్థులైరి. మనము చేయగలిగిన దెల్ల బంతి నొకమూలనుండి యింకొకమూలకు దోలుటయే. శరీరకమయిన బాధ తొలగించి, మానసికమయిన బాధను దెచ్చిపెట్టుదుము. ఇది డాంటీయను శాస్త్రజ్ఞుఁడు చెప్పిన నరకపుకధవలె నున్నది. అక్కడ లోభులకందఱకు నొక పెద్ద బంగారపు ముద్దనిచ్చి దానినొక పర్వతముపైకి దొల్లించమని యానతిచ్చిరట. వారు పైకి దోసినప్పుడెల్ల నదిమరల క్రిందకుఁ దొర్లుచుండును. శాశ్వత సుఖమును గూర్చి మనము చెప్పుకొను నవన్నియు కట్టుకధలుగాని యంతకంటె వానియందు విశేషమేమియును లేదు. అట్టిసుఖమున్నదని నమ్మువా

రందరును తమకే యది తటస్థించునని కూడ తలంచుచుందురు. ఇదియొక విచిత్రమయిన యస్వార్థ పరాభిప్రాయము.

మనమీలోకమునకు సుఖము నీయఁజాలము. అట్లే దానికి బాధను గలిగింపజాలము. సుఖదుఃఖశక్తుల మొత్తపుసముదాయ మెన్నఁడును మార్పుజెందదు. మనమక్కడ దాని నిక్కడకు, నిక్కడగాని నక్కడకును ద్రోయగలము గాని మొత్తము మాత్రము మారదు. అదిదానికి స్వభావము. ఈయుత్పత నాధోపతనములు స్వభావసిద్ధములు. ఈపోటు పాటులు సహజములు. వీని యభావము మృతిలేని జీవనమువంటిదే. అట్లు తలంచుట కేవల మవివేకము. ఏమనిన బ్రతుకనుట తోడనే చావు. సుఖమనుటతోడనే దుఃఖమును పరస్పరాశ్రయములయి యున్నది. దీపము విడువకుండ తగులబడుచున్నపుడది దీనికి జీవనము నేల జీవించవలెనని ననుక్షణము మృతినొందుచుండవలెను. చావుబ్రదుకులు రెండును నొకే వస్తువుయొక్క భిన్నమయిన పర్యాయ పదములు, దృష్టిభేదమునుబట్టి వానినట్లు వాడుదుము, అవి యొకే కెరటముయొక్క మొరకపల్లములవంటివి. ఇవిరెండును కలిసియే కెరటమేర్పడుచున్నది. ఒకఁడు పడుటను జూచి దోషైక దృక్కుగా నగుచున్నాఁడు. రెండవవాడు లేచుటనుజూచి, గుణగ్రాహి యగుచున్నాఁడు. బాలుడు తల్లిదండ్రులచే రక్షింపఁబడుచుఁ బడికి పోవునప్పుడు వానికన్నియు సుఖప్రదములుగానే యుండును. అతనికేమియు విశేషముగా నక్కఱలేదు. ఆతఁడు గొప్పగుణగ్రాహి. వృద్ధుఁడు తనయనుభవముచేత శాంతినొందిన వాఁడై తనవేడియంతయుఁ జల్లారినవాఁడుగానుండును. అట్లే ప్రాచీనమయిన జాతులు నాశన చిహ్నములను జూచుచు, నవీన జాతులవలె నంత ధైర్యమును గలిగియుండవు. దీనికి హిందూదేశమున నొక సామెత గలదు. "వేయేండ్లు పట్టణము వేయేండ్లు వనము" అని ఇట్లు పట్టు

ణములు ధనములుగా మారుట ప్రతిచోటను జరుగుచున్నది. ప్రజలు వారు వారు చూచిన యవస్థలను బట్టి ధైర్యాధైర్యములు గలవారగు చున్నారు.

తరువాతవిషయము సమానత్వము. భావిసుఖపదవియే కర్మ నాచరించుటకు మనకుఁ బురికొల్పు గొప్పయుత్సాహశక్తి. అనేకమత ములిట్లు బోధించుచున్నవి. భగవంతుఁడు తానుస్వయముగా ప్రజాపరి పాలనము చేయుటకు వచ్చుననియు నప్పుడు భేదములేవియు నుండవని యు బోధించుచుండును. ఇట్లు బోధించువారు మతోన్మాదము గలవా రు. వారుమిగుల ధారాళమైనవారు. క్రైస్తవమతమిట్టి మతోన్మాదము తోడనే బోధచేయఁబడినది. అందుచేతనే యదిగ్రీకు, రోమక, బానిసల కు ప్రియమయినది. ఆమతము ప్రకారము బానిస తనముండదు. తినుట కు ద్రాగుటకు గావలసినంత యుండును కాబట్టి వారందరు క్రైస్తవ ధ్వజము నాశ్రయించిరి. దానిని మొదట బోధించినవారేమియుఁ దెలి యని మూఢభక్తులేగాని వారేమియు కాపట్యము లేనివారు. ఈకాల ములో నాసుఖపదవి, సమానత్వము, స్వేచ్ఛసహభ్రాతృత్వమునను రూ పములం బ్రవర్తిల్లుచున్నవి. ఇదియు మతాభినివేశమే నిశ్చయమైన స మానత్వ మిదివరకెన్నడును లేదు. ఇక ముందెన్నడు నుండదు. మనమం దరము నిక్కడ సమానముగా నుండుటెట్లు. అట్టి యసంభవమయిన స మానత్వమునకర్థము మృతియే. ఈలోకమిట్లుండునట్లు చేయునదేది? సమానత్వము లేకపోవుటయే ప్రాథమికమయిన ప్రలయావస్థలో నన్ని యు సమానస్థితియందుండును. అప్పుడు లోకమునందలి నిర్మాణశక్తు లన్నియు నెట్లువచ్చును. స్పర్థవలనను, పోరాటమువలనను, మథనమువ లనను వచ్చును. పదార్థములనందలి యణువులన్నియు, నొకేస్థితియందు న్నవని యనుకొనిన సృష్టి యెట్లుపొసగును? శాస్త్రమువలన నదియు

సంభవమని తెలియవచ్చుచున్నది. ప్రశాంతమైన నీటిని కదిపిన వెంటనే దానియందలి యణువులన్నియు, మరల శాంతినొందుటకై యొండొంటిదాకి, స్పర్థచేయును. అట్లే సృష్టియందలి ప్రతివస్తువును, తొల్లింటి నిశ్చలావస్థను వచ్చుటకై ప్రయత్నించుచుండును. మరల నొకకదలికగలుగును.మరల సృష్టి సమనయము తటస్థమగుచుండును. సృష్టికి మూలమే భేదము. మరియును సృష్టిని భేదమును గలిగించు శక్తులెంత యావశ్యకమో యభేదమును గలిగింపఁ బ్రయత్నించు శక్తులునంతయావశ్యకమే.

కేవల మభేదము లోకమున నెన్నటికి నుండదు. అట్టిస్థితి తటస్థించునప్పటికి లోకమున జీవనమనునది యుండుటకు వీలుండదు. కాఁబట్టి యవ్యయమయిన సుఖము సర్వసమత్వమునను వానికొఱకై ప్రయత్నించుట నాశనమును దెచ్చిపెట్టుకొనుటయే. ఒకమనుష్యునకును, ఇంకొక మనుష్యునకును, భేదమును గలుగజేయునదెద్ది? బుద్ధియందలి భేదము. ఈదినముల నందరు నొకరీతి బుద్ధిశక్తితో బుట్టినారని యెవరును జెప్ప సాహసింపరు. మనము లోకములో పుట్టినప్పుడే భిన్నమయిన శక్తులతోఁ బుట్టుదుము. అధికులముగాను, అల్పులముగాను, జన్మింతుము. ఆప్రకారము జన్మకు పూర్వమే నిర్ణయింపఁబడిన యవస్థను దప్పించుకొన నెవరికిని శక్యముకాదు. అమెరికనులగు నిండియను లీదేశమున వేనవేలేండ్లుండిరి. తరువాత మీపూర్వులు కొలదిమంది వారిదేశమునకు వచ్చిరి. దేశముయొక్క రూపమునకు వారెంత మార్పునుగలుగజేసిరో చూచితిరా!అందరుసమానులే యయినయెడలనిండియనులభివృద్ధియగుపనులొనరించి పట్టణములు మున్నగు వానింగట్టకపోనేల?మీపూర్వులతో కొండొక విధమయిన మేధశ్శక్తి దేశమునకు వచ్చి పూర్వవాసనలనేకము బయలుదేరి యవి పనిచేసి, వ్యక్తమయినవి కేవలభేద రాహిత్యమనగా మృతి లోకమున్నంతవఱకు భేదముండితీరును. సృష్టియం

తమగునప్పుడు గాని భేదరాహిత్యము గలుగదు.తత్పూర్వమభేదము రా నేఱదు. కాని యీ కేవలసుఖపదవి కొఱకైన వాంఛమాత్రము గొప్ప యుత్సాహశక్తిగానున్నది. సృష్టికి భేదమెట్లావశ్యకమో యట్లే భేదరాహిత్యము కొఱకైన ప్రయత్నమును, ఆవశ్యకమే. ముక్తినొందుటకును దేవుని జేరుటకును ప్రయత్నము లేనియెడల సృష్టియు నుండజాలదు. ఈ రెండు శక్తులకు నుండు భేదమే, మనుష్యుల యుద్దేశముల స్వభావమును నిర్ణయించునదై యున్నది. ఈయుద్దేశములు సర్వదా యుండును. కొన్ని బంధమునకును, కొన్ని మోక్షమునకును లాగుచుండును. లోకచక్రము యొక్క నిర్మాణమతిక్లిష్టమైనది. మనచేయి యందు బెట్టితిమా యింకనాశలేదు, మనమేదో ధర్మమును నెఱవేర్చితిమని సంతసించుచుము. కాని యందుకొంతభాగము నెఱవేర్చువరకు మరల నింకొకటి సిద్ధముగా కనిపెట్టి యుండును. ఈ మహాయంత్రము యొక్క ప్రభావములో బడి కొట్టుకొని పోవుచున్నాము. దానినుండి తప్పించుకొనుటకు రెండేమార్గములు కలవు. ఒకటి యీయంత్రము జోలికిఁబోకుండ తటస్థులమయి యుండుట. మనకోరికలను విడిచిపెట్టుట. అదిచెప్పుట చాల సుకరమేఁగాని చేయుట చాల దుష్కరము. కోటి కొక్కరైన నట్లు చేయగలిగిన వారుందురాయని సంశయింప వలసియున్నది. రెండవది లోకమునఁ బ్రవేశించి కర్మరహస్యమును దెలుసుకొనుట. అది కర్మయోగమార్గము. లోకచక్రమునుండి పాఱిపోక దానియందు బ్రవేసించి కర్మరహస్యమును దెలుసుకొనవలెను. లోపలనుండి యుక్తమైన కర్మనాచరించుటవలన గూడ బయలుబడుటకు వీలుకలుగును. ఈ యంత్రము మూలముననే పైకిరావచ్చును.

కర్మయనగ నేమో తెలిసికొంటిమి. అది ప్రకృతికి మూలమున్న సర్వదా యుండునదియునై యున్నది. దేవునియందు నమ్మకముగల వారి

కిది సుబోధముగానుండును. భగవంతుఁడు మన సహాయము గోరునంత టి దుర్బలుఁడు గాడని వారికిఁ దెలియును. ఈసృష్టి నిత్యమైనను మన గమ్యస్థానము మాత్రము మోక్షమే. కర్మయోగము ప్రకారము మోక్షము కర్మవలన పొందవలెను. లోకమున సంపూర్ణసుఖమును బొందుటయందు గలకోరిక యుత్సాహశక్తిని నుపోషించును. అది మూఢభక్తులకు వినియోగించును. మూఢభక్తివలన మేలును కీడును గూడ గలుగును. లోపలనున్న మోక్షాపేక్షకంటె నితరమయిన యుత్సాహశక్తి మేలకావలెనని కర్మయోగి యడుగును? ప్రాపంచిక వాంఛలకతీతుఁడనై యుండవలెను. "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" మనుష్యుఁడు దీనిని దెలిసికొని యభ్యసింపవలెనని కర్మయోగి చెప్పును. సత్కార్యము చేయుటయే, స్వభావము గానైనప్పుడు, వానికే యితర యుద్దేశము అక్కఱలేదు. మనము సత్కార్యము చేయుదుము గాక. ఎందుచేత? సత్కార్యము చేయుటమంచిది గనుక. స్వర్గము నపేక్షించి సత్కార్యము చేసినను, బద్ధుఁడగుచున్నాఁడని కర్మయోగి చెప్పుచున్నాఁడు. స్వార్థమైన కోరిక లెంతమాత్రమున్నను ఆకర్మవలన మనకు బంధము తప్పదు. కాబట్టి ఫలవిరాగము, నిస్సంగము మాత్రమే సాధనము. ఈలోకము మనము కామనియు, మనమీలోకము కామనియుఁ దెలిసికొనవలెను. మనము శరీరమును గాము, మనము పనిచేయుటయును లేదు. మనముశాశ్వత శాంతిగల యాత్మలము. మనము దేనిచేతనైన బద్ధులము కానేల? మనము పూర్ణమయిన వైరాగ్యమును గలిగి యుండవలెనని చెప్పుటమంచిదే. గాని దానికుపాయమేమి? ఫలాపేక్షలేకుండ మనముచేయు ప్రతిసత్కార్యమును మనలను, బంధించిన గొలుసులలో నొకదాని నూడదీయుచుండును. ప్రతిఫలాపేక్షలేకుండ మన మూహించెడు ప్రతిసదూహయును, లోకమున వ్యాపించి మ

నబంధములను సడలించి మనలను, క్రమ క్రమముగా పవిత్రమయిన వారినిగాఁ జేయును. కాని యిది యంతయు మెట్టవేదాంతముగాను, ఆచరణ దుస్సాధ్యముగాను, దోచును. భగవద్గీతల పైఖండనవాదములను జేసినవారి ననేకులను జూచినాను. వారందరును, ఫలాపేక్ష లేకుండ కర్మ నాచరింపలేమని చెప్పిరి. వారెన్నడు నట్టి నిష్కామ్య కర్మను జూచి యెఱుగనందున నట్లు చెప్పినారు.

ఈకర్మయోగము నాచరించి చూపిన పురుషుని విషయమున కొన్ని మాటలు చెప్పెదను వినుఁడు. అట్టి పురుషుఁడు బుద్ధుఁడు. అతఁడే యీయోగమును పూర్ణముగా నాచరణలోనికిఁ దెచ్చిన వాఁడు. తక్కిన మహాపురుషులందరు నేవో యుద్దేశములతోడనే బయులుదేరిరి. ఇతఁడు గాక తక్కిన మహాపురుషుల నందరిని, రెండు తెగలుగా విభజించ వచ్చును. అందొక తెగవారు తాము భగవంతుని యవతారములనువారు, రెండవ తెగవారు దేవదూతలమనువారు. వారెంత వేదాంతముగా మాటలాడినను, వారికర్మకు ప్రోత్సాహము పైనుండి కలిగినది. వారు ప్రతిఫలము నపేక్షించినారు. కాని బుద్ధుఁడొకఁడు మాత్రము "భగవంతుని విషయమై మీసిద్ధాంతములు నాకక్కఱలేదు. ఆత్మ విషయమయిన సూక్ష్మసిద్ధాంతములను తర్కించుట వలన లాభమేమి ? సత్కార్యములను జేయుఁడు, సజ్జనులై యుండుఁడు ఇవి. మీకు మోక్షసాధనము. ఇది మిమ్ము సత్యమునకుఁగొని పోవును" అని చెప్పినాఁడు. అతఁడు ఆచరణమునఁగూడ నేమియు వాంఛలు లేక యున్నాఁడు. అంతకంటె నెక్కువ పని జేసినవాఁడు లేఁడు. అంత ఘనుఁడెవ్వఁడును లేఁడు. మానవ కోటి యందాతనితో తుల్యుఁడు లేఁడు. అట్టియున్నతమైన వేదాంతమును అట్టి కరుణను గలిగి అత్యున్నతమైన వేదాంతమును బోధించుచు ప్రాణుల యందతికరుణుఁడై స్వార్థపరత నెంతుఁగ యున్న మహాను

భావుఁడీతఁ డొక్కఁడే. అతఁడే యద్వితీయుఁడైన కర్మయోగి. నిష్కా మకుఁడు. మానవకోటియందాతనితో తుల్యుఁడులేఁడు అతనియందసమానమైన మేధశ్శక్తియు నిరుపమానమైన కరుణయు మిశ్రమైనవి అతఁడు లోకమునఁ బయలుదేరినసంస్కర్తలలో మొదటివాఁడు „పూర్వపు గ్రంథములను నమ్మవలదు. మీవారందరు నమ్ముచున్నారని విశ్వసింపకుఁడు. మీచిన్నతనమునుండియు నమ్ముచున్న కారణముచేత నమ్మియుండవలెనని యెంచకుఁడు. పూర్ణముగా తర్కించిచూచి విమర్శించి యదియందఱకు మేలైనదని మీకునిశ్చయముగాఁ దోఁచినయెడల దానినినమ్మి యాప్రకార మాచరించియితరుల కాచరించుటకై నాయమొనర్పుఁడు„ అని చెప్పినవారిలో మొదటివాఁడీతండే. అపేక్షలేకుండపనిచేసినవాఁడే బాగుగా చేయగలఁడు. అట్లుచేయగలిగిన వాఁడు బుద్ధునివంటివాఁడగును. అట్టివానినుండి లోకమునంతను మార్చగలిగిన శక్తి కలుగును. అట్టి పురుషుఁడు కర్మయోగమునకులక్ష్యమై యుండును.



